


నవంబరు 1978 సంచికతో

అందిస్తున్న

పూర్తి నవల

# పంచాయితి

రచన:

ఆలేటి నాగమణి

# పంచాయితీ

"త్ర్హూ"

ఒక్కసారి కాండ్రించి ఉమ్మేసి, భూదెమ్మ దిక్కు చ

నారయ్య. భూదెమ్మ మొహం వెలవెలాపోయింది.

"నీ యవ్వ....యింక నీ బతుకింతెనె" అన్నట్టుగా ఉ

పుగా చూసాడు నారయ్య.

భూదెమ్మ దీనంగా చూసింది. నేరం చేసినదానిలా తల

వాల్చుకుంది.

"యిగ లాభంలేదె బూది! మందు పోయిస్తా! నీకు

లేదు. ఈ యవ్వారం యింతటితో పైసల జెస్తైనె నేను బత

లేకుంటే నా చిప్పాదొప్పా పట్టుకొని యిండ్లపొంటి తిర

అంటూ తన నిశ్చయాన్ని తెలియచేశాడు.

భూదెమ్మ మాట్లాడలేదు. తల వంచుకునే నిలబడి

చేయని నేరానికి తలవాల్చినట్టో లేక, నారయ్య మాటలకు

వంచినట్టో తెలియలేదు నారయ్యకు.

"యిగవా....యింటికి. యింకెందుకు నిలవడుదు" అ

ముందుకు కదిలాడు.

భూదెమ్మ దీనంగా, భారంగా, దిగులుగా కదిలింది.

కళ్ళల్లో, మనసులో అంతులేని నిరాశ....నిస్సత్తువ....వెళ్ళిపో

వాళ్ళిద్దరి వంక అయోమయంగా చూసాడు మూడోమనిషి

జోస్యం చెప్పేవాడు.

అఫ్‌జల్ గంజ్ దాటి, సిటి సెంట్రల్ లైబ్రరి

నారయ్య వెనక భూదెమ్మ వస్తోందా లేదా అని ఒక్కసారి

చూడలేదు. బీడీ పీలుస్తూ గబగబా అడుగులువేస్తూ

నారయ్య చెవుల్లో చిలకజోస్యం చెప్పేవాడి మాటలే

సాగాయి.

అంతేకాదు-వరసగా భూదెమ్మ, భూదెమ్మత

తండ్రి రాజయ్య యింట్లోవున్న నలుగురాడపిల్లలు గుర్తుకు రావడంతో అతనికి కోపం, అసహ్యం కలగసాగాయి.

"నీ యాలి ముండమొయ్య....నా గతి, దానిగతి అంతె. ఈ ఆడముండల పెత్తనం నాకు తప్పేటట్టులేదు. అసలు తప్పంతా ఆ కోటిముండకుడుకుది. వద్దురా అంటె నన్ను యిరిటానికిచ్చిందు. ఏం లాభానికొచ్చింది? చిప్పదొప్ప మిగులుతున్నాయ్....ఇంతకి ఈ బూది ముండ....యిదెం తక్కువ తిన్నద. పోరి పుట్టిందని సప్పుడుజేస్త లేదుగాని....లేకుంటె నన్ను లెక్కనె జేయదాయె. తల్లిలెక్క తయారైతుంది రోజురోజుకు....అన్ని ఆ బుద్ధులె. మొగన్నికొట్టి మొరపెట్టి చాష్టలు....పోరిని కన్నదా? నేనేదే అంటానని భయపడుతున్నట్టు. గుబులుగా జూస్కుంట బుగులు పడుతున్నట్టె మాట్లాడుతుంది. యిగ రెండురోజులు పోని మల్ల నా మీదికె సవారైతది. ఏది ఏమైనా ఈ సారి ఊరికి కొంచపోయి మందు పోయిస్తా....ఆ జాలిముండ, రాజిగాడు ఏంజెస్తరో జూస్త."

బస్సు హారన్‌కు ఉలిక్కిపడుతూ ఒక్క అంగలో పుట్‌పాత్ మీదికి పరిగెత్తి వెనుతిరిగి చూసాడు నారయ్య.

భూదెమ్మ దిగులుగా నడుస్తూ మెల్లగా అడుగులు వేస్తోంది. దగ్గిరవరకూ వచ్చేదాకా ఆగాడు నారయ్య.

"ఎందె బూది? పెండ్లినడకలు నడుస్తున్నావ్! సాతనైత లేదా?" అన్నాడు కొంచెం కోపంగా.

భూదెమ్మ అడ్డంగా తలాడించింది.

"మరేందిగట్లున్నవ్?" అన్నాడు ఆ రోడ్డుమీదే నిలదీస్తూ.

"ఎట్లున్న....నాకేంగాలె" అంది.

"నీ సూరత్ జూస్కోవె....రోతిరి మెకం...." అంటున్న నారయ్య మాటలకు భూదెమ్మ కళ్ళు తుడుచుకుంది.

నారయ్య తనకు మందు పోయిస్తానన్నప్పటి నుండి ఆమెకు దిగులుగానే వుంది. ఏమైనాసరే మందు తాగొద్దని అనుకుంది. కాని ఆ మరుక్షణంలోనే ఆమెకు చిలకజోస్యం చెప్పేవాడి మాటలు గుర్తుకు వచ్చి, గుండె గతుక్కుమంది.

తన చేయిచూసి, జరిగిపోయినవాటి గురించి వాడు చెప్పిందంతా నిజమే. జరుగుతున్న విషయం వివరంగా అంతా ఉన్నదున్నట్టుగానే చెప్పాడు. జరగబోయేది చెప్పాడు. గతం వర్తమానం నిజం అయితే భవిష్యత్తు కూడా వాడు చెప్పినట్టే....“అమ్మో....” అట్లయితె తనేంకావాలి? నారయ్య ఏమైపోతడు? ఒకటికాదు రెండు కాదు....తొమ్మిదిమంది....నడుస్తున్న భూదెమ్మ తొమ్మిదంకె గుర్తుకు రావడంతో ఉలిక్కిపడిపోయి, చటుక్కున ఆగిపోయింది.

ఆమె కాళ్ళల్లో, వొంట్లోని ప్రతి అణువులో నీరసం ఆవహించింది. ఇక నడవలేనట్టు అక్కడే ఫుట్‌పాత్ మీద కూర్చుండి పోయింది.

కళ్ళు చీకట్లు కమ్ముతున్నట్టూ, తలంతా గిర్రున తిరుగుతున్నట్టూ శరీరం స్వాధీనం తప్పిపోతున్నట్టూ అన్పించి, కళ్ళు గట్టిగా మూసుకొని, కూర్చున్న చోటనే ఓ ప్రక్కకు వొరిగిపోయింది.

మొహంమీద చల్లటి నీటిచినుకులు పడ్డంతో, మెల్లగా కళ్ళు తెరిచిన భూదెమ్మ తనవైపే ఆతృతగా, దిగులుగా చూస్తున్న నారయ్యను చూసింది.

“లె....రిచ్చాలో పోదాం....” అంటూ రెక్కపట్టి లేవదీసాడు. చుట్టూ మూగిన జనం ప్రక్కకు జరగడంతో రిక్షాను బేరం చేసి, ఆమెను కూర్చోబెట్టి తాను కూర్చున్నాడు.

“సాతనైతుందన్నావు గదవె....మల్లెందుకు పడిపోయినవ్? కండ్లు తిరిగినయ్యా” మెల్లిగా అడిగాడు.

“ఊఁ....”

“మరీ సంగతిగాడనె జెప్తె రిచ్చా ఆడనే ఎక్కుదుము గద” అన్నాడు లాలనగా భూదెమ్మ భుజం నిమురుతూ.

“నేను మందు తాగనయ్యా....యింకొక్కసారి సూద్దాం.... అప్పుడు గూడా యింతె అయితె మందు తాగుతా” అంది అడిగిన ప్రశ్నకు జవాబు అదే అయినట్టు.

నారయ్య మాట్లాడలేదు.

రిక్షా నెమ్మదిగా పోతోంది.

"నీ కాల్మొక్కుతనయ్యా! ఆడు జెప్పిన మాటలన్నీ నిజమే కావొచ్చు. అయినా సరె ఈ ఒక్కసారికి ఊఁకే....నా కెందుకే ఈ సారి...."

భూదెమ్మ మాటలు పూర్తికాకముందే గుర్రుగా చూసాడు నారయ్య.

"నేనేం నూర్లు సంపాదిత్తున్నాననుకున్నావా? లేక నీ అయ్యా అమ్మ మనకోసం లచ్చలుకూడబెడుతున్నారనుకుంటున్నావా? ఆల్లు సంపాయించెదంతా మీ అక్కకె పోతది. నాకు తెలుసు. రేపు రేపటి సంగతేంది? నేను, నువ్వు, పిల్లలు చిప్పలు పట్టుకొని యిండ్లపొంటి తిరుగాల్నె."

"నీ యవ్వ సంగతి నాకు తెలుసు....కూడబెట్టి కూడబెట్టి అంతా నీ అక్కకి గట్టబెట్టది. యిగ నీ అయ్యకు నా మీద పానమున్న, ఆడిమాట మీ యవ్వకాడ సెల్లదు. యిప్పటికె నలుగురు మరింక ఐదుగుర్ని."

"ఒక్కసారి...." భూదెమ్మ మాటలు పూర్తికాకముందు గయ్యిమంటూ అరిచాడు నారయ్య.

"నీ యవ్వ .... జెప్తాంటె నీక్కాదు....సమజ్ జెయ్యో" అన్నాడు.

రిక్షదిగి యింట్లోకి వెళ్ళేసరికి, అందరికంటే చిన్నపిల్ల పాక్కుంటూ వచ్చి భూదెమ్మ కాళ్ళకు వాటేసుకుంది.

మౌనంగా పిల్లను వొళ్ళోవేసుకొని, అక్కడే గుంజకు ఆనుకొని కూర్చుంది భూదెమ్మ.

"ఏమన్నడు డాకటరు? కడుపుల నొప్పెందంట?" అన్నాడు పొగాకుతో చుట్టలుచుడుతున్న రాజయ్య.

నారయ్య మాట్లాడలేదు. వాకిట్లో వాల్చిపున్న నులకపంచం మీద కూర్చున్నాడు.

"ఏందవ్వ....బూది? ఏమన్నడె?" అన్నాడు రాజయ్య.

"ఆల్లేందో సెప్తున్నారు. అందుకె మనూరికి కొంచ పోతా"

అన్నాడు నారయ్య.

"దేనికి?"

"కడుపుల నొప్పికి."

"నీల్లు వోసుకున్న పిల్లకు మందు వోయిస్తడంట....మంచి పనె" అంది ఈసడింపుగా. అక్కడే ఆకు వేసుకుంటూ కూర్చున్న బాలమ్మ.

బాలమ్మ మాటలకు, రాజయ్య ఆశ్చర్యపోయాడు. కడుపు నొప్పనే భూదెమ్మకు కడుపుతో వున్నానన్న విషయం తెలీదా? నారయ్యకూ తెలీదా? ఊరికి తీసికెళ్ళి మందు పోయించడం ఏమిటి?

అతనేదో అడగాలని నోరుతెరిచేలోగానే బాలమ్మ అందుకుంది.

"ఎన్నో నెలంట?"

"మూడు...."

"అవ్వ....పిల్లకు ఆర్నెల్లు....నీకు మూడ్నెల్లు....వారు.... దమ్మిడి సంపాదనలేదుగాని...."

"నువ్వూరుకోయె...." రాజయ్య మందలించబోయాడు.

"గుడ్డిముండాకొడుకా....నువ్వ జెర నోరు మూస్కో. ఎవని తాతసొమ్మని....తింటుంటె గుట్టలు కరుగుతై. ఎంతకాలమని నేను కష్టంచేసి పెడ్తు? ఆడిదాని సొత్తు కాశపడె...."

బాలమ్మ మాటలు పూర్తికాకముందే విసురుగా లేచాడు నారయ్య.

"ఈ సంగతి నన్ను యిరిటం తీస్కుంటప్పుడు తెల్వలె...."

"ఆఁ....సక్కనోడవని"

మరుక్షణంలో మాటామాటా పెరిగింది. బాలమ్మ, రాజయ్యా, నారయ్యా ముగ్గురు బూతుమాటలతో ఒకరి నొకరు తిట్టుకుంటూ కుమ్ములాటకు సిద్ధపయ్యారు.

పక్కయింట్లో వుండేవాళ్ళు రావటంతో కుమ్ములాట ఆగిపోయింది కాని, నారయ్య మాత్రం దానికంతా కారణం అయిన భూదెమ్మను రెండుదెబ్బలు కొట్టి బాలమ్మ, రాజయ్యమీద వచ్చిన కోపం, తీర్చుకున్నాడు.

* * *

రాజయ్యకు బాలమ్మకు పెళ్ళయి ముప్పయ్ఐదు సంవత్సరాలు కావొస్తోంది. ఎలాంటి క్షణంలో, రాజయ్య బాలమ్మ మెళ్ళో మూడు ముళ్ళు వేసాడోకాని, అతని నోటికి తాళం వేసుకున్నాడు.

ప్రతిక్షణం వాళ్ళిద్దరు, ముప్పయ్ఐదేళ్ళ సంసార జీవితంలో బద్ధ శత్రువుల్లా ప్రవర్తిస్తూ పోట్లాడుకోవడం, కాట్లాడుకోవడం, తిట్టుకోవడం, వీధినపడి కొట్టుకోవడం సరిపోయింది.

బాలమ్మకు నోటి దురుసు ఎక్కువ. భర్త అన్న గౌరవం ఎంతమాత్రం లేనిమనిషి. ఆమె దృష్టిలో, రెండువందల చిల్లర సంపాదించే రాజయ్య ఓ చేతకాని వెధవ....ఏం తెలీని సన్నాసి.

గవర్నమెంటు ఆఫీసులో చప్రాసి ఉద్యోగంచేసే రాజయ్య ఆమెకు ఓ అసమర్ధుడిలా, అమాయకుడిలా ఆమె నోటికి భయపడే భీరువులా కన్పించేవాడు.

పైగా రూపంలో కూడా—రాజయ్య, మోటుగా, కండలు తేలి బలంగావున్నా, బాలమ్మ ముందు మేకపిల్లలాంటివాడు. నల్లగా, మొహంనిండా మచ్చలతో, వుండే అతనికి దేవుడు చేసిన మరో లోపం—అతనికి ఒకే కన్నుంది. రెండో కన్ను గుడ్డి కన్ను.అతను బయటెంత పులో యింట్లో నల్లిలా, పిల్లిలా ఏ మెరుగని బల్లిలా వుంటాడు. దానిక్కారణం బాలమ్మేనని ఆ వీధిలోని వారందరికీ తెలుసు. అందుకే అతనంటే జాలి.

ఇక బాలమ్మ—

నల్లగా వున్నా కళ గల మొహం, పెద్దగా వెడల్పుగా, గుండ్రటి బొట్టు దిద్ది, నీలంరంగు చీర, ఎర్రటి రవిక వేసుకొని, వేలుముడి అయినా అందంగా వేసుకొని, కాళ్ళకున్న కడియాలు, మెట్టలు చప్పుడవుతూండగా మట్టి తట్ట నెత్తిన ఎత్తుకొని ఉప్పరిపని చేస్తుంటే—మేస్త్రీ లొట్టలు వేసుకుంటూ చూసేవాడు.

ఉప్పరిపనికి వెళ్ళి మన్నుతట్టలు మోసినా, బాలమ్మ శుభ్రంగా తయారై వెళ్ళేది. మెళ్ళో గుళ్ళపేరు, కాసులదండ, చెవులకు గంటీలు, రెండు ముక్కులకు పెద్దపెద్ద ముక్కుపుడకలు, కుడిచేతికి బంగారుదండె కడియము. నడుముకు వెండి వడ్డాణం పెట్టుకొని, ఆకు

వేసుకొని, పండిన ఎఱ్ఱటి పెదాలతో నవ్వుతూ, మేస్త్రీకి కనువిందు చేసేది.

పెళ్ళయి ఏడేళ్ళు దాటినా బాలమ్మకు పిల్లలు పుట్టలేదు. దాని క్కారణం రాజయ్యేనని నమ్మకంతోపాటు, అతనంటే అసహ్యం ఏర్పడ్డాయి బాలమ్మకు.

ఆమె ఏనాడూ రాజయ్యను భర్తగా ప్రేమించలేదు, గౌరవించి అభిమానించలేదు.

పెళ్ళయిన కొత్తలో....అతనికి లొంగిపోయినా, రోజు రోజుకు అతనంటే అసహ్యం పెరగడంతో, దగ్గరికి రానిచ్చేదికాదు. దగ్గరికి వచ్చిన అతణ్ణి కుక్కకంటే హీనంగా దూరంగా తరిమేసేది.

అందరూ వినేలా అరిచి ఏడ్వడంతో అతను వెనక్కి వెళ్ళి పోయేవాడు. ఒక్కోసారి అతని అమాయకత్వానికి, మెతకతనానికి జాలివేసి మౌనం వహించినా ఏడేళ్ళ కాపురంలో తానింకా తల్లి కానందుకు దానిక్కారణం రాజయ్యేనన్న అనుమానంతో, భర్త అంటే చులకనభావంతోపాటూ, తానంటే పడి ఛస్తూ తానేం చేసినా, తన నోటిదురుసుకు మౌనంవహించి ఊరుకుంటాడని అతని బలహీన తను పసికట్టిన బాలమ్మ....తను తల్లి కావాలనుకుంది. తన పిల్లలకు రాజయ్య తండ్రి కాకపోయినా తాను మాత్రం తల్లి కావాలనుకుంది.

అంతే—

సంవత్సరం తిరిగేసరికల్లా బాలమ్మ ఓ కూతురును కన్నది. ఎఱ్ఱగా బొమ్మలా వున్న ఆ పిల్లను చూసి, యెవరి పోలికో అర్ధం కాక, వెఱ్ఱిమొహం వేసుకొని చూసాడు రాజయ్య బాలమ్మవైపు.

బాలమ్మ అతన్ని గమనించే స్థితిలో లేదు. పక్కలో వెచ్చగా నిద్రపోతున్న ఆ పసిపాప మొహంలో నర్సిమ్మను చూసు కుంది.

అతను మేస్త్రీ....ఎఱ్ఱగా పొడుగ్గా, లావుగా, నిండుగా వుంటాడు. అతణ్ణి చూడగానే తను చలించిపోయింది. ఏదో ఆశ.... తపన....బలహీనత బలంగా అతనివైపు లాక్కెళ్ళితే—

ఆ రోజు—

వారంచివర కూలీలందరికీ కూలి డబ్బులిస్తూ, ఆఖర్న తన కిస్తూ చిన్నగా నవ్వి, సైగ చేసాడు.

అందరూ వెళ్ళిపోయినా తాను అలాగే నిలబడిపోయింది. అతను డబ్బంతా లెఖ్ఖ చూసుకొని, తనవంక చూసి, "పద" అన్నట్టుగా తల ఎగురవేసి, ముందుకు కదిలాడు.

మూడంతస్తుల మేడ కడుతున్నారప్పుడు. ఆ స్థలంలోనే ఓ మూల రేకుల షెడ్డులో వుంటున్నాడు నర్సిమ్మ.

అతనికి పెళ్ళాం పిల్లలు ఎవరూలేరు. ఎక్కడా అతనిదనే యిల్లు, అతనివాళ్ళు లేరు. ఎక్కడ పని చేస్తుంటే అక్కడే ఆ పని ముగిసేవరకూ, రేకులషెడ్డు వేసుకొని వుంటాడు.

మనిషి మంచివాడనే చెప్పాలి. జీవితంలో ఆకలితోపాటు, మిగతా అన్ని అవసరాలు తీర్చుకునే తెలివి వివేకం వున్నాయి అతనిలో.

అతనికి నచ్చినవారితో యిట్టే స్నేహం పెంచుకోగల సమర్థత శక్తివుందతనికి.

బాలమ్మ అతనికి నచ్చిందనే చెప్పాలి. అంతేకాదు. బాలమ్మకు అతను నచ్చాడు. ఆమె కళ్ళలో అతన్ని చూడగానే అర్థంకాని భావం అలలా కదిలి కరిగిపోయేది. అతను ఆమె అవసరాన్ని అర్థం చేసుకోకపోయినా ఆకలిని, ఆశను గుర్తించాడు.

అందుకే ముందడుగు వేసాడు.

రేకుల షెడ్డులో అతని చేతుల్లో యిమిడిపోయిన బాలమ్మకు తానో యింటి యిల్లాలినని, ఓ భర్తకు భార్యనని. తాను చేస్తున్నది తప్పని గుర్తుకురాలేదు.

"బాలి....నా బంగారం" అనే నర్సిమ్మ మాటలకు మురిసిపోయింది.

మూడునెలలు గడిచాయి. మేడ పూర్తయింది.

నర్సిమ్మ మజిలి ఎత్తేసాడు.

"నేను నీతో వస్తాను" అంది బాలమ్మ.

"యాడికి?" విస్తుపోతూ అడిగాడు.

"నువ్వేడికంటే ఆడికి."

"నీ మొగుడు...."

"ఆడొట్టి సన్నాసి...."

"కాదు. ఆడు సంసారి. నేను సన్నాసోణ్ణి. నా ఎంట వస్తే ఏం వుండదు. ఆడొట్టి ఎర్రిబాగులాడు. కాబట్టి యీ మూణ్ణెల్లు గడిసాయి. నేనే గనక నీ మొగున్నయితే నిన్ను పాతేసేవాణ్ణి" అన్నాడు.

బాలమ్మ నిర్ఘాంతపోయింది.

"గట్ల జూస్తున్నవేంది? మీసమున్న మొగోణ్ణి...." అంటూ మీసం మెలేసి నవ్వాడు.

"బారీ....నువ్వు సిలకలాంటిదానివె నీమీద నాకు నమ్మకం లేదు. ఇయ్యాల రాజిగాణ్ణి యిడిసి నాతో వచ్చేదానివి. రేపు నన్ను యిడిసిపోవని ఏందీ నమ్మకం....నీ సంగతి తెలిసి నేను నిన్ను నా ఎంట కొంచవోతనని ఎట్లనుకున్నావ్."

"అంటె—?"

బాలమ్మ మొహంలో నెత్తురుచుక్కలేదు. అతని దృష్టిలో తాను ఓ పచ్చి బజారు స్త్రీలా మిగిలిపోయానన్న నిజం ఆమెను నిలువునా కాల్చి, అతనిమీద కోపం బుసలుకొట్టింది.

"పొస్లకు....నీ యిజ్జతె వోతది. నాదేంది....మొగోన్ని. పెళ్ళాం పిల్లలు లేనోన్ని. దునియ నన్నేం అనదు. గుడ్డోడైనా ఈ సంగతి తెలిస్తే ఆ రాజిగాడు నిన్నొండ్దటడు. అందుకె నోరు మూస్కో. మరిగ నేను వోతా!" అంటూ వెళ్ళిపోతున్న నర్సిమ్మతో -

"నేను....సీల్లు వోసుకున్నా!" అంటూ చెప్పాలనుకుంటూనే చెప్పలేకపోయింది బాలమ్మ.

ఆమె ఓటమిలో ఆమెలో రాజయ్యమీద ద్వేషంగా మారింది. తనలాకావడానికి కారణం రాజయ్యేనన్న భావం ఆమె మనసంతా నిండిపోయింది.

"సంటిది ఎవ్వరోతె వుందే?" రాజయ్య ప్రశ్నకు ఉలిక్కిపడుతూ అతని మొహంలోకి చూసింది. చీకటి నిండిన ఆ యింట్లో,

కిరసనాయిలు దీపం సన్నగా వెలుగును పరుస్తోంది. ఆ వెలుగులో ఆ ప్రశ్న అడిగిన రాజయ్య మొహం, ఆమె కళ్ళకు భయంకరంగా వొంటికన్ను రాక్షసుడిలా కన్పించింది.

"నీవోలె లేదు" అంది కసిగా.

"నీవోలె కూడా లేదు" అన్నాడు నవ్వుతూ.

అతని నవ్వు ఆమెకు అసహ్యాన్ని పెంచింది.

"మరి ఎవ్వరిలెక్క వుందంటావ్?" అంది కోపంగా.

"మా యవ్వోలె వుందె...." అన్నాడు పాపను నిమురుతూ.

"ఊం...." అంటూ మూలిగింది బాలమ్మ.

"మా యవ్వపేరు పెట్టుకుందారె" అన్నాడు.

"ఆఁ...." అంది బాలమ్మ ఈసడింపుగా.

చివరికి బాలమ్మే నెగ్గింది....తన తల్లిపేరు పెట్టుకుందికాని- రాజయ్య తల్లిపేరు పెట్టుకోనియ్యలేదు.

మల్లమ్మకు మూడేళ్ళు వచ్చినాకా మళ్ళీ నీళ్ళోసుకుంది బాలమ్మ.

ఈసారి పుట్టిన బిడ్డను చూస్తూనె రాజయ్య కళ్ళు మెరిసాయి.

ఆ పిల్ల అచ్చంగా రాజయ్య పోలికే.

మసూచికం వచ్చి రాజయ్య ఓ కన్నుపోయి అందవికారంగా, అసహ్యంగా, భయంకరంగా తయారైయాడు కాని నిజానికతడు నల్లగా వున్నా కళ గల మొహం. పెద్ద పెద్ద కళ్ళతో పొడువాటి ముక్కుతో బాగానే వుండేవాడు.

"ఈపోరి అచ్చంగా నా లెక్కనె వుందె! బాలీ ఈసారి ఈ పిల్లపేరు మా అవ్వపెరె" అన్నాడు.

బాలమ్మ మాట్లాడలేదు.

నిజానికి ఆ పాపకు తండ్రి రాజయ్యే. కారణం కావచ్చు ఆమె మౌనానికి కారణం.

చివరికి ఆ పిల్లకు భూదేవి అనిపేరు పెట్టుకున్నారు. కాని పలకరాక, పిలువలేక, భూదేవి కాస్తా భూదెమ్మగా 'బూది'గా మారి పోయాయి.

ఇద్దరి ఆడపిల్లల వయసులో మూడేళ్ల తేడావున్నా, వాళ్ళ జీవితాలకు, పెంపకాలకు, తల్లితండ్రుల ప్రేమకు చాలా తేడాలు.... ఎన్నెన్నో దూరాలు.

పెద్దకూతురు మల్లమ్మ అంటె బాలమ్మకు ప్రాణం. తెల్లగా అందంగా వుండే మల్లమ్మను ఎంత ప్రేమగా చూసుకునేదో, రెండో కూతురు భూదెమ్మను అంత దూరంగా వుంచేది. మల్లమ్మ వేసుకున్న కొత్త ఫ్రాకులు పాతబడిపోయాకా, భూదెమ్మకు వేసుకునే అవకాశం వచ్చేది. ప్రతి పండక్కి కొత్త గౌనువేసి, మురిపెంగ కూతురును చూసుకునే బాలమ్మ. దూరంగా నిలబడి, తల్లివంక, అక్కవంక దీనంగా చూస్తూ అర్థంకాని ఆలోచనలతో, సతమతమైపోతూ అయోమయంగా తండ్రివంక చూసేది భూదెమ్మ. రాజయ్యకు ఈ తేడాలెందుకో అర్థంకాలేదు. ఇదేం అని భార్యను నిలదీసి అడిగే ధైర్యం లేదతనికి.

ఇద్దరు పిల్లలను కన్నతల్లి ఒక్కతే, రెండు కళ్ళలా చూసుకోక, ఒకరికి పాలు, మరొకరికి నీళ్ళు పంచియిచ్చే ఆ తల్లి మనసులో వున్న భేద భావం ఏమిటో ఎందుకో రాజయ్యకు పూర్తిగా అర్థం కాకపోయినా, అతని అమాయక హృదయానికి అర్థం అయిన విషయం ఒక్కటే—అది. మల్లి తెల్లగుంటది. సక్కదనం ఎక్కువ. మరి బూది....నావోలె కర్రెగుంటది. కాని కళెక్కువ. అందుకే బాలికి మల్లి అంటే పానం....అని సరిపెట్టుకున్నాడేగాని, తెల్లగావున్నా, నల్లగావున్నా తల్లిప్రేమ ఒకేలా అందరి పిల్లలమీద సమానంగా వుంటుందని మాత్రం గ్రహించలేదు.

అతనికి మల్లమ్మ అన్నా, భూదెమ్మ అన్నా ప్రాణమే. ఇద్దరిపట్ల అతనికి ప్రేమ ఒకేలావుంది. పోతే—భార్య తత్వంచూసి భూదెమ్మ అంటే ఓ పిసరు జాలి ఎక్కువ పడేవాడు. కాని ఏం లాభం మల్లమ్మతో పోటీచేయలేని భూదెమ్మ అస్తమానం ఏడుస్తూ కనిపించేది.

ఆ యింట్లో భూదెమ్మ పుట్టాకా పరిస్థితులు మారిపోయి బాగా కలిసివచ్చింది.

రాజయ్యకు జీతం పెరిగింది. ఉప్పరిపనిచేసే బాలమ్మకు రోడ్లుచేసేదాంట్లో గవర్నమెంటు ఉద్యోగం దొరికింది. రోడ్లు బావు చేసేటప్పుడు మన్నుమోయడం, కంకరమోయడం ఇదీ పని. నెల తిరిగేసరికి రాజయ్యా సంపాదించేంత సంపాదన చేతుల్లో వుండేది. పని అంతగా లేకపోయినా, జీతంరాళ్ళు ఠంచనుగా ఫస్టురోజు చేతుల్లో పడేవి.

దాంతో బాలమ్మకు కాస్తా గర్వంలాంటిది పెరిగింది. అప్పటికే రాజయ్యా పెళ్ళాంగా కాక, బాలమ్మ రాజయ్యకు మొగుడుగా తిరిగే బాలమ్మ రాజయ్యను ఏ విషయంలో జోక్యం తీసుకోనీయక, ఇంటా బయట తన అజమాయిషీ నడిపిస్తూ ఆడపెత్తనంతో ఆ యింట్లో ఓ విధమైన వాతావరణం సృష్టించింది.

తిండికి ఏవిధమైన లోటు వుండేదికాదు. నలుగురున్న ఆ యింట్లో పగలంతా నిశ్శబ్దంగా, నిర్లిప్తత రాజ్యంచేసినా సాయంత్రం నాలుగున్నర దాటిందిమొదలు, రాత్రి ఎనిమిది దాటే వరకు ఒక్క బాలమ్మ కంఠం కంచులా మ్రోగుతూ, చుట్టుప్రక్కల వారికి ఆమె ఓ గయ్యాళిగా మొగుణ్ని చేతకానివాడిలా జమకట్టే మగనాలిలా, నోరు పారేసుకునే మొరటుదానిలా కన్పించేది. వాళ్ళ తగాదాలలో ఇంటి విషయాలలో ఎవ్వరూ కలగచేసుకునే వారుకాదు.

"బూది పుట్టినంకనే నీకు కొలువైంది" అన్నాడు రాజయ్యా.

ఆ అదృష్టం అంతా భూదెమ్మదే అన్నట్టుగా.

"ఆఁ....లచ్చిమి నవ్వుతుంది" అంది కోపంగా.

"నిజంగా చెప్పే బాలీ:అది కర్రెగుందని కాని దాని మొకంలో లచ్మికల...."

"దరిద్రపుముండ....దాని కర్రెమొకంలో లచ్మికాదు. శనుంది శని లం...." అంటూ, కసిగా తిట్టింది.

రాజయ్యా మాట్లాడలేదు.

కాని బాలమ్మకు తెలుసు. భూదెమ్మ తెల్లగా లేకపోవచ్చు. రాజయ్యా కూతురే కావొచ్చు కాని....భూదెమ్మ పుట్టిం తరువాతనే ఆ యింట్లో లక్ష్మి నడిచింది. నెలకు కాసింత డబ్బు కూడుతోంది.

అప్పుడో యిప్పుడో కాసు బంగారం కొనుక్కుంటూ, దాచుకుంది. ఉదయంలేచి, భూదెమ్మ మొహం చూస్తేచాలు....రోజంతా హాయిగా నెమ్మదిగా ఏ లోటులేకుండా గడిచిపోతోంది. భూదెమ్మ పుట్టాకా తిండి విషయంలో మార్పువచ్చింది. గొడ్డుకారం తిని గడిపే రోజులు పోయి కూరా, నారా తెచ్చుకొని, రెండు పూటలు సుష్టుగా తింటున్నారు.

భూదెమ్మ ఎలా ఎలా పెరుగుతుంటే అలా అలా డబ్బు పెరిగింది. ఉండడం పట్నంలోనైనా, పుట్టి పెరిగిన ఊరు పల్లె కాబట్టి, ఉండడానికి ఓ పెద్ద యిల్లు, తిండి గింజలకోసం, కొంచెం కొంచెంగా పొలం కొనుక్కుంది బాలమ్మ.

మల్లమ్మను స్కూల్లో వేసిన మూడేళ్ళకు భూదెమ్మను పంపించింది బాలమ్మ. ఆ మూడేళ్ళుగా చదువుతున్నా, అక్షరాలు మొత్తం నేర్చుకోలేదు మల్లమ్మ. గారాబంతోపాటు, పెంకితనం ఎక్కువకావడంతో ఒక్కరోజు స్కూలుకు వెడితే వారం రోజులు స్కూలుకు సెలవు యిచ్చేసేది మల్లమ్మ. వెళ్ళిన ఒక్కరోజుకూడా క్లాసులో సెనగలూ బఠాణీలు తింటూ కూర్చొని, ప్రక్కపిల్లలు అడిగి లేదనిపించుకొని లాక్కుంటె, వాళ్ళను కొట్టి, గిల్లి, రక్కి తగాదా పెంచుకొని వెళ్ళిన గంటకే యింటికి పారిపోయి వచ్చేసేది.

యింటికిరాగానే ఒకత్తె ఓ మూల కూర్చొని ఆడుకునే భూదెమ్మతో తగాదాకు దిగేది.

తల్లికి లోకువైన భూదెమ్మ మల్లమ్మకు లోకువైపోయింది. సాయంత్రం తల్లో రాగానే భూదెమ్మమీద చాడీలు చెప్పేది. భూదెమ్మ ఏమీ అనకపోయినా, తానన్నవే ఆ పిల్లమీదికి త్రోసి కొట్టేవరకూ ఏడ్పు సాగించేది!

అసలే భూదెమ్మ అంటే గిట్టని బాలమ్మ, కూతురు మాటలకు భూదెమ్మను, సవతితల్లికంటే హీనంగా తిట్టి, కొట్టేది. ఆ క్షణంలో భూదెమ్మ ఒక్కత్తైపోయి, ఒంటరిదైపోయి, యింకా యింటికిరాని తండ్రి గురించి వెతుక్కుంది. ఆ యింట్లో ఆ పసిదానికి అన్నీ అయి చూసుకునేవాడు రాజయ్య ఒక్కడే.

రోజూ సాయంత్రం యింటికిరాగానే, రాజయ్య భూదెమ్మను చంకనేసుకొని మెల్లగా బయటికి దాటుకునేవాడు.

అక్కడికి కొంచెం దూరంలో వుండే కల్లుపాకలోకి వెళ్ళి పోయేవాడు. భూదెమ్మకు సెనగలు, మిరపకాయ బజ్జీలు, కొని తిని పించేవాడు. తాను కాసింత కల్లుతాగి, చీకటిపడ్డాకా యిల్లు చేరుకునే వాడు. బాలమ్మ అరుస్తూ, తిడ్తూ అన్నంపెడ్తే, తిని, భూదెమ్మను పక్కలో వేసుకొని పడుకునేవాడు.

ఉదయం బాలమ్మ తొందరగా వెళ్ళిపోయేది. రాజయ్యే వంట చేసి పిల్లలను స్కూల్‌కు పంపించి, తాను టిఫెను కట్టుకొని, ఇంటికి తాళంవేసి, వెళ్ళిపోయేవాడు.

భూదెమ్మకు చదువు బాగానే అబ్బింది. ఏడాది తిరిగేసరికి అక్షరాలు, గుణింతం అంతా వచ్చేసి, చిన్నచిన్న పదాలు తప్పులు లేకుండా రాయడం వచ్చేసింది.

ఆ సంవత్సరం మల్లమ్మకూడా ఆ క్లాసునుండి భూదెమ్మతో సహా పైక్లాసుకు అతి బలవంతంగా తరలింపబడింది.

భూదెమ్మ తెలివి; చురుకుతనం బాలమ్మకు గొప్పగా అన్పించ లేదు. కాని మల్లమ్మ పైక్లాసుకు వెళ్ళడం చాలా ఆనందాన్ని కలిగించింది.

వాళ్ళిద్దర్ని చూడ్డంలో తేడా ఎందుకో రాజయ్యకు నర్సిమ్మను చూసాక అర్థమైంది.

ఆ రోజు రాజయ్య యింటికి వచ్చేసరికి వాకిట్లో నులకమంచం మీద కూర్చున్న నర్సిమ్మను వెంటనే గుర్తించలేదు. కాళ్ళు చేతులు కడుక్కొని వచ్చిన రాజయ్యకు, "మా అవ్వగారి ఊరు సూ స్తనని వచ్చిండు. ఏదన్న కొలువు యిప్పించమంటుండు" అంది బాలమ్మ.

"ఊహుం"....అన్నాడు రాజయ్య. అతని చూపు అనుకో కుండా నర్సిమ్మ వొళ్ళో కూర్చున్న మల్లమ్మమీద పడింది.

ఎంతో చనువుగా అతని వొళ్ళో కూర్చున్న మల్లమ్మ బిస్కెట్టు నములుతూ, దూరంగా నిలబడ్డ భూదెమ్మను ఊరిస్తోంది.

భూదెమ్మ దూరంగా నిలబడి తల్లివంక, నర్సిమ్మవంక,

అయోమయంగా, మల్లమ్మవైపు ఆశగా చూస్తోంది.

"ఊళ్లె అందరు బాగున్నరా?"అన్నాడు రాజయ్య ఏదో ఒకటి మాట్లాడాలి కాబట్టి.

"ఊఁ...." అన్నాడు నర్సిమ్మ.

మళ్ళీ ఏం అడగాలో తెలీలేదు రాజయ్యకు. దూరంగా నిలబడ్డ భూదెమ్మను తీసుకొని బయటికి రాబోయాడు.

"ఒక్కడవె వోతవా ఏంది? ఆయనేమనుకుంటడు? ఆయన్ను కూడా తీస్కపో" అంది.

"మరి....నీకు...."

"యింటికాడికి పట్టుకురా...." అంది నడుముక్క దోపుకున్న సంచిలో నుండి ఐదురూపాయల నోటుతీసి యిస్తూ.

నర్సిమ్మను తీసుకొని కల్లుపాకకు వెళ్ళాడు రాజయ్య. వెంట మల్లమ్మకూడా వచ్చింది.

నర్సిమ్మ రూపం చూడ్డానికి తాగనివాడిలావున్నా, అతడికి సీసాలు సీసాలు మింగేసికూడా, నిశ్శబ్దంగా, మత్తులో పడిపోకుండా, నిభాయించుకోగల శక్తి వుంది.

అందుకే రెండు సీసాలు తాగేసరికి రాజయ్య మాట అదో విధంగా మారినా, నర్సిమ్మ యింకా హుషారుగానే వున్నాడు. యింకో సీసా తాగేసరికి రాజయ్య పూర్తిగా మత్తులోపడ్డాడు. నర్సిమ్మ మరో రెండు సీసాలు తాగి, అక్కడే ఆ ప్రక్కనేవున్న ముసలవ్వ అమ్మే మిరపకాయ బజ్జీలు, సెనగలు, వడలు, మాంసం సీసాలతోపాటు నంజుకొని బయలుదేరాడు.

తూలుతున్న రాజయ్య శరీరాన్ని ఎలాగైతేనేం యింటివరకు లాక్కొచ్చి, వాకిట్లో వున్న నులకమంచంమీద చేరవేసి, యింటికి బాలమ్మకోసం తెచ్చిన కల్లుసీసా అందించాడు. అతనికి అన్నం వడ్డించి, తాను ప్రక్కనే కూర్చొని, తింటున్న తల్లివంక అర్థం కాకుండా చూపింది భూదెమ్మ.

"నిద్రవో"....అంది బాలమ్మ.

రాజయ్య ప్రక్కనే వెళ్ళి పడుకుంది భూదెమ్మ. ఎన్నడు

రాజయ్య ప్రక్కన పడుకోని మల్లమ్మను కూడా రాజయ్యకు మర్లో ప్రక్కన పడుకోబెట్టి ఉన్న ఒక్క గదిలోకి వెళ్ళిపోయింది బాలమ్మ. ఆ వెనుకే నర్సిమ్మ వెళ్ళి తలుపుమూసి లోపలనుండి గడియవేసాడు.

మరునాడు చాలా ఆలస్యంగా నిద్రలేచాడు రాజయ్య.

అతను లేచేసరికి, బాలమ్మ వంటపూర్తి చేసింది.

"యియ్యాల పోతలేవా?" అన్నాడు రాజయ్య యింకా వెళ్ళకుండా యింట్లోవుండి వంటచేస్తున్న బాలమ్మతో.

"ఊహుం"....అంది తప్ప అసలు కారణం చెప్పలేదు బాలమ్మ.

తనకు ఆలస్యం అవుతుందేమోనని, గబగబా తయారై బయలుదేరాడు రాజయ్య.

ఆ సాయంత్రం అతను తిరిగి వచ్చేసరికి, బాలమ్మ చేపల పులుసు పెట్టినట్టుంది. వాసన రావడంతో "ఆల్ల అవ్వగారి సుట్టం. అందుకే మర్యాదలు బాగజేస్తది" అనుకుంటూ నవ్వుకున్నాడు.

రాజయ్య వచ్చిన అరగంట తరువాత, నర్సిమ్మ లేచి నిలబడి, "పాయె అన్న! అట్ల వొయొద్దాం" అన్నాడు.

రాజయ్య రోజూ కనీసం ఒక్క సీసా తాగకుండ వుండలేడు. అందుకే భూదెమ్మను వెంట తీసుకొని బయలుదేరాడు.

మల్లమ్మ... "రావె"....అంటూ,నర్సిమ్మ మల్లమ్మను రెండు భుజాలమీద కూర్చోబెట్టుకొని బయలుదేరాడు.

"ఎవరిపిల్ల ఆల్లకు ముద్దు" అనుకుంది బాలమ్మ.

నర్సిమ్మ వచ్చి పదిరోజులు దాటుతోంది. పనిపాట లేకుండా మూడుపూటలా తింటూ, సాయంత్రం కాగానే పొట్ట పగిలేలా సీసాలకు సీసాలు కల్లు తాగుతూ, యింట్లోనే వుంటున్న నర్సిమ్మకు ఉద్యోగం ఏదైనా పని చేసుకోవాలని వున్నట్టు అన్పించలేదు రాజయ్యకు.

"పని ఏడ్నైనా సూసుకుంటున్నాడా?" అని ప్రశ్నించాడు బాలమ్మతో.

"ఊ"....అంటూ నీకెందుకన్నట్టుగా చూసింది రాజయ్య

వైపు.

"దేవులాడుకుంటుదంట" అంది ఆ తరువాత.

"ఎన్నడు?"

"ఏమో! అయినా ఎంది గట్లంటవ్ ఆయనింటె ఏమను కుంటడు?" అంది నిలదీస్తూ, రాజయ్య అలా అడగడం నేరం అన్నట్టుగా.

రాజయ్య మరేం అడగలేదు.

ఆ రాత్రి రాజయ్య తాగడానికి వెళ్ళలేదు. వారం రోజులుగా నర్సిమ్మకు తనకు ఖర్చు బాగానే అయింది. ఏ ఒక్కనాడు నర్సిమ్మ ఒక్క రూపాయి ఖర్చుచేయలేదు. ఆరోజు రాజయ్య జేబులో పావలా పైసలు మరునాటి బీడీలకన్నట్లుగా మిగిలి వున్నయ్. అందుకే అతను మౌనంగా తిని పడుకున్నాడు.

అతనింకా పూర్తిగా నిద్రలోకి జారుకోలేదు. నర్సిమ్మ వచ్చిన అలికిడి అయింది.

"బాలీ....కూడెట్టె" అన్నాడు మత్తుగా.

"ఓ....రాజన్న యియ్యాల తాగలేనట్టుంది. ఎందుకే బాలీ? పైసలు లేవా?"

"ఊఁ....ఆడు తాగకపోతే నిద్రపోడు..."అంది గుంభనంగా.

"అంతే__"

నర్సిమ్మ మౌనంగా భోజనం ముగించి లేచాడు.

"ఇయ్యాల బైటనే పండుకో" అంది బాలమ్మ.

"ఎందుకే? అంతభయం....ఆడు నిద్రపోయాకే...."

"ఊహు...." అంటూ భయంగా, బెదురుగా రాజయ్యవంక చూస్తూ గదిలోకెళ్ళి తలుపులు మూసుకుంది బాలమ్మ.

లీలగా వాళ్ళ సంభాషణ విన్నా అసలు విషయం ఏమిటో పూర్తిగా అర్థం కాకపోయినా, రాజయ్యకు ఏదో అనుమానం, మనసులో చేరి రాను రాను చీడపురుగై మనసును తొలిచేయసాగింది.

ఆ మర్నాటినుండి ప్రతిక్షణం, ప్రతి అడుగులో, ప్రతి మాటలో బాలమ్మను నర్సిమ్మను గమనించసాగాడు.

ఆ మర్నాడు సాయంత్రం రాజయ్య యింటికి వచ్చేసరికి బాలమ్మ లేదు. కూరగాయలు తేవడానికి బజారుకుపోయింది. మల్లమ్మ లేదు. భూదెమ్మ ఒక్కత్తె వుంది యింట్లో ఏడుస్తూ.

"నర్సిమ్మ ఏడి?" భూదెమ్మను అడిగాడు.

"అక్కను ఎత్తుకొని......ఏడికో వోయిండు" అంది.

"నిన్నెందుకు కొంచవోలె?"

"ఏమో?" అంది.

"నేను తీస్కపోత. ఏడ్వకు" అన్నాడు.

అతనికి కల్లు పాకవైపు వెళ్ళాలన్పించలేదు. నెమ్మదిగా భూదెమ్మను నడిపిస్తూ బజారున పడ్డాడు.

"అవ్వ పగటేల కొట్టిందే" అంది భూదెమ్మ.

"ఎందుకు?"

"లోపలి కొటిల్ల, మల్లవ్వ నిద్రపోతుంది. ఆల్లిద్దరు కూడా లోపలి కొటిల్లనే పండుకుంటారు. నన్ను ఎండలనే కూకోమంటారు. నాకేమొ కాల్లు కాల్తుంటయ్...." భూదెమ్మ మాటలు పూర్తికాక ముందే ఉలిక్కిపడుతూ చూసాడు రాజయ్య.

భూదెమ్మ అమాయకంగా చెబుతోంది.

"మీరు యిస్కులుకు వోతలేదా?" అన్నాడు.

"మల్లమ్మ వస్తలేదు అయ్య. నేను వోనంటి అమ్మతిట్టింది. కొట్టింది" అంది భూదెమ్మ. రాజయ్యకు ఏదో అర్థం అయి అర్థం కాని స్థితిలో వుండిపోయాడు.

రాత్రి ఎనిమిది దాటుతుండగా వచ్చాడు రాజయ్య. భూదెమ్మ భుజంమీద నిద్రపోతోంది. నులక మంచంమీద భూదెమ్మను పడుకో బెట్టి ప్రక్కన కూర్చున్నాడు.

"బువ్వ పెట్టిన" అంది బాలమ్మ రాజయ్య నుద్దేశించి.

"నర్సిమ్మ తిన్నాడా?"

"ఆఁ....యింతదాంక నీకోసం జూసిండు. నువ్వేడికి వోయినవో తెల్వక నేనే తినమన్న" అంది బాలమ్మ.

"కాలువ సంగతేమయింది?"

"ఏమో?"

"ఇంకెన్ని రోజులుంటాడు ఈడు?" కొంచెం కోపంగా అడిగాడు. బాలమ్మ జవాబివ్వలేదు.

"పగటేల భూదెమ్మ నెందుకు కొట్టినవో?"

"బద్మాష్ ముండ....ఇస్కూల్‌కు పోనంటే...."

"మరి మల్లవ్వ నెందుకు పంపలే."

"దానికి పెయిల బాగలేదు. సుస్తుగా కన్పించింది."

"లేపటినుండి నర్సిమ్మను ఈడతిన్న, ఏడికన్నవోయి పడుకోమను" అంటూ వెళ్ళి మంచంమీద పడుకున్నాడు రాజయ్య.

బాలమ్మకు ఏదో అనుమానం....బెరుకు....భూదెమ్మ చెప్పిందేమోనన్న శంక పీడించసాగింది.

రాజయ్య తననేం చేయలేడన్న ధైర్యంవున్నా, మనసులో ఏ మూలనో భయంలాంటిది కలగసాగింది. ఆ క్షణంలో భూదెమ్మ మీద బోలెడంత కోపంవచ్చింది. కాని అప్పటి తన కోపం తనకే శత్రువైతుందని మౌనంగా వుండిపోయింది.

అర్ధరాత్రి హఠాత్తుగా మెలుకువ వచ్చింది రాజయ్యకు.

గదిలో ఏవో గుసగుసలు—గాజుల గలగలలు....

నర్సిమ్మ పక్కవైపు చూసాడు.

ఖాళీగా కన్పించింది.

రాజయ్య మొహం వెలవెలబోయింది.

బాలమ్మ—గయ్యాళిదే కావచ్చు. తానంటే పడి చావకపోవచ్చు.తనంటే అంతగా యిష్టంలేకపోవచ్చు....కాని యిలా....యిలా ప్రవర్తిస్తుందని ఊహించని రాజయ్య మనసు కొన్నిక్షణాలు బండబారిపోయింది.

"ఆడెవడే నన్ను పొమ్మంటానికి....రేపే అడుగుతా?"

"ఏమని?"

"నన్నెందుకు పొమ్మన్నాడో...."

"ఆడు అనడం తప్పుకాదు. నువ్వు ఏదన్న కొలువు సూసుకో! మేస్త్రీ పనైనా నీకు ఎప్పుడూ వుండేది చూసుకో...."

"నాకు తిండి ఖర్చయితున్నదనా ఈ ఏడ్పు అంతా?"

"అదిగాదయ్యా...నీ తిండికయ్యే ఖర్చు నేను పెట్టుకుంటా... మతలబు అదిగాదు. ఆ కర్రె లం....లేదూ అది ఆడితో ఏంచెప్పిందో కాని....మనమీద ఆడికి అనుమానం వొచ్చి వుంటది—"

"ఆడిమొహం....అనుమానంవచ్చి ఏంజేస్తాడు. ఖచ్చితంబట్టి అడిగితే మల్లవ్వ నాకు పుట్టిందని జెప్త."

"చెప్పి...."

"దాన్ని, నిన్ను తీస్కపోతనంటి."

తాగిన మత్తులో నర్సిమ్మ అన్నమాటలను విశ్వసించలేక పోయింది బాలమ్మ. అందుకే సంభాషణ ఎక్కువ పెంచలేక, "నువ్వు పండుకో....రేపు మాట్లాడుకుందాం" అంది.

"నువ్వు రాయమే...."

"ఇయ్యాల వద్దయ్యా! నువ్వు వొయ్యి నీ పక్కల పండుకో రేపు పగటిల నుంచి వస్తా మాట్లాడుకుందాం" అంది. కాని నర్సిమ్మ విన్లేదు.

మరో అయిదు నిమిషాలకు నర్సిమ్మ బయటికి వచ్చాడు.

రాజయ్య సగం చచ్చిన శవంలా వుండిపోయాడు. అన్నీ విన్నా, చూపినా, కదలకుండా విగ్రహంలా పడుకుండిపోయాడు.

చాలారాత్రి గడిచింది.

అతనో నిశ్చయానికి వచ్చి, లేచి కూర్చున్నాడు. ప్రక్కనే నిద్రపోతున్న భూదెమ్మను భుజాన వేసుకొని, బయటికి వచ్చి నిర్మానుష్యంగావున్న రోడ్డువెంట నడిచి బజారువైపు వచ్చి ముందుకు సాగిపోయాడు.

ఆ చీకట్లో చల్లగాలిలో....అతను చాలా దూరం నడిచి నడిచి ఒక యింటిముందాగి, తలుపు తట్టాడు. ఐదు నిమిషాలకు తలుపులు తెరుచుకున్నాయి. అప్పుడు తూర్పున వెలుగురేఖలు పరుచు కుంటున్నాయి.

రాజయ్యను చూస్తూనే ముందుగా ఆశ్చర్యపోయి, అంతలోనే "రా అన్నా...." అంటూ ఆహ్వానించింది నిద్రమత్తు వొదుల్చి

కుంటూ, కనకమ్మ.

"మీ అయ్య లేడా?"

"పండుకున్నడు....లేపుత. కూకో...." అంటూ వెళ్ళి తండ్రిని లేపింది.

కనకమ్మ తండ్రి సివయ్య, రాజయ్య పనిచేసే దగ్గరే మరో చప్రాసి. ఇద్దరిమధ్య వయసుతేడా బాగావున్నా స్నేహితుల్లా కలిసి పోయారు.

సివయ్యకు ఉన్నదొక్కతే కూతురు కనకమ్మ. ఆ అమ్మాయికి చాలా చిన్నతనంలోనే పెళ్ళిచేసాడు. తీరా కాపురానికి వెళ్ళేముందు అల్లుడు కాస్త వాతంకమ్మి పోయాడు. దాంతో కనకమ్మ తండ్రిదగ్గరే వుంది.

కూతురు జీవితంలో జరిగిన అన్యాయాన్ని తలచుకుంటూ కుమిలిపోతూ, తన బాధను అప్పుడు, ఆత్మీయుడు అయిన రాజయ్యతో చెప్పుకొని కొంచెం ఓదార్పు పొందేవాడు సివయ్య.

మల్ల మారుమనువు సేయిరాదు అని రాజయ్య యిచ్చిన సలహా ప్రకారం కనకమ్మకు రాజయ్యద్వారానే ఓ సంబంధం కుదిర్చి పెళ్ళి చేసాడు. అల్లుణ్ణి యిల్లరికం తెచ్చుకున్నాడు.

ఇప్పుడు కనకమ్మ, అల్లుడు, సివయ్య కలిసేవుంటున్నారు.

ఆ మర్నాడు___

నిద్రలేచిన బాలమ్మ మంచంమీద రాజయ్యతోపాటు భూదెమ్మ కనిపించకపోవడంతో గతుక్కుమంది. అతను అంత ప్రొద్దున్నే ఎక్కడికి వెళ్ళాడో ఎంత ఆలోచించినా అంతు పట్టలేదామెకు.

మామూలుగా వంట పూర్తిచేసింది. పదిగంటలు కావొస్తున్నా రాజయ్య వస్తున్న సూచనలు కన్పించలేదు. నర్సిమ్మ నిద్రలేచి, సుష్టుగా తిని ఎక్కడికో వెళ్ళిపోయాడు. మల్లమ్మను స్కూల్‌కు పంపించి, తాను పన్లోకి వెళ్ళకుండా యింట్లోనే వుండిపోయింది.

మధ్యాహ్నం కావొస్తున్నా రాజయ్య రాలేదు. బాలమ్మకు అతనేమైపోయాడో ఎక్కడికి వెళ్ళాడో ఎంత ఆలోచించినా అర్థం కాలేదు. అసలేం జరిగిందని అతను చెప్పకుండా భూదెమ్మను వెంట

తీసుకొని వెళ్ళిపోయాడో తెలియదు.

ఆ సాయంత్రానికి కూడా రాజయ్య రాలేదు.

నర్సిమ్మ రాగానే అడిగింది ఎక్కడైనా కనిపించాడేమోనని.

కనిపించలేదన్నాడు.

"పోనిలెవె....మంచిదేగా....మనం పోదావనుకున్నాం ఆడె పోయిండు" అన్నాడు.

"అదికాదు....ఎందుకు వోయిందో తెల్వకపోయె" అంది బాలమ్మ.

"ఎందుకు వోతె నీకెందుకు. వోయిండు. సాలగు" అన్నాడు నర్సిమ్మ. ఎందుకోగాని బాలమ్మకు నర్సిమ్మ మాట అంతగా రుచించలేదు.

వారంరోజులు గడిచినా రాజయ్య రాలేదు.

ఆరోజు రాజయ్య పనిచేసే చోటుకు నర్సిమ్మను పంపించింది. నర్సిమ్మ తిరిగివచ్చి చెప్పిన విషయం విని అంతగా బాధపడలేదు బాలమ్మ.

"ఆడు రోజు దఫ్తరుకు వస్తున్నాడు. అడ్నె పనిచేసె మరో సప్రాసి లేదు సివయ్య, ఆళ్ళింట్లో వుంటున్నడంట. మన యవ్వారం ఆనికి అంతా తెలిసిపోయినట్టుంది. ఆ నాడు రాత్రి మనం మాట్లాడు కోంగ యిన్నట్టుంది. ఏదుంటే ఏంది నర్సిమ్మ ఏడున్న అందరూ సుఖంగుంటె సాలు అని అన్నాడు. ఆడింక యింటికి రానట్టె అవుపించింది మాటలు వింటుంటే" అన్నాడు నర్సిమ్మ.

బాలమ్మ మాట్లాడలేదు. నిశ్శబ్దంగా, నిర్లిప్తంగా వుండి పోయింది.

రాజయ్య వెళ్ళిపోయినందుకు, తిరిగిరానని అన్నందుకు, భూదెమ్మను వెంట తీసుకెళ్ళినందుకు ఆమె ఏమాత్రం బాధ పడ్డట్టు కన్పించలేదు.

ఆమె ఏనాడూ మనస్ఫూర్తిగా రాజయ్యనుకాని, భూదెమ్మను కాని ప్రేమించలేదు. వాళ్ళంటే ఆవిడకు అసహ్యం తప్ప అభిమానం లేవు. కాని....సమాజానికి, లోకం యేమంటుందోనని, నర్సిమ్మ తన

యింట్లో వుండడం, రాజయ్య వెళ్ళిపోవడం గురించి తానేం చెబుతుంది?

కులంవాళ్ళకి తెలిస్తే వెలివేస్తారు. వాళ్ళంతా ఉండేది ఊళ్ళోనేనైనా ఈ విషయం ఎన్నాళ్ళని దాగుతుంది? ఎన్నాళ్ళని తను దాచగలుగుతుంది?

ఒకవేళ రాజయ్యే ఊళ్ళోవాళ్ళకి ఈ విషయం చెబితే తన గతేం కాను?

ఆ ప్రశ్నకు జవాబు—ఒక్క నర్సిమ్మే అనుకుంది బాలమ్మ.

"నేను ఆడికి యిదుపు కాయితం రాసిస్తా. మనం యాదగిరి గుట్టకాడికి వోయి మారు మనువు సేసుకుందాం" అంది బాలమ్మ ఆ రాత్రి నర్సిమ్మతో.

"ఊఁ...." అన్నాడు నర్సిమ్మ.

"ఊఁ కాదు. నువ్వు గట్టిగ జెప్తె నేను ఊరికిబోయి వస్త మరి" అంది.

"ఏంది?"

"మనం మారు మనువు సేసుకుందాం...."

"ఆడికి నువ్వు యిదుపుకాయితం ఇయ్యకపోతే ఏందంట? నేను నిన్ను మారు మనువాడకపోతే ఏంది?" అన్నాడు.

"అంటె—"

"మనం ఇట్లనే వుందామె బాలి....మనువుకు నాకు సానా దూరం. నా కెందుకో నిన్ను సూసినంక పెల్లాం అన్నా మనువన్నా నమ్మకం పోయింది" అన్నాడు.

"దేనికి?" విస్తుపోతూ అడిగింది.

"రాజయ్య గుడ్డోడె—కాని మంచోడు. కర్రోడె అయినా ఆడికి వొంట్లో చీమునెత్తురుంది. అందుకె ఆడి పెల్లాం మరొకడ్ని సూసుకొని, బుగులువడకుండా యింట్లోనే వుంచుకుందని తెలిసి నిన్నేం అనకుండా ఆడి తొవ్వ ఆడు జూసుకుండు. ఇది దునియకు ఆడొట్టి సేతకానోనిలా, కన్పించినా, ఆడు మంచోడు. మాలావు మంచోడు. అందుకే నీ సుఖం అడుగుతుండు. మరి నేను—నిన్ను

మారుమనువాడితె రేపు నాకంటె మంచోడు కన్పిస్తే నువ్వు ఆడెం బడి బడిపోవని నమ్మకమేంది నాకు?"

"నర్సిమ్మా....!" నిర్ఘాంతపోయింది బాలమ్మ.

"నేను వొట్టుతింట నర్సిమ్మా" అంది మెల్లిగా.

"నీ వొట్టెవనికి గావల్నే....నువ్వు రాజయ్య లగ్గంలో బాప నోడు చేపిస్తే పమానాలు జెయ్యలె. అవన్నీ నిలబెట్టుకుంటున్నావా? ఆడ్ని దగా జేస్తన్నవు నువ్వు. ఆడు నీకు దూరంగా యిడిపిపెట్టి పోయె. అయినా....నీకు కావల్సింది నే నియ్యంగా యింకా మను వెందుకె ఎర్రిదానా?"

"వద్దు నర్సిమ్మ! నువ్వట్ల అంటె యిప్పుడు నేనేంగావాల్నె? మనువు సేసుకుందాం! ఆడంటే నా కిట్టంలేదు. నువ్వు మనువాడి నంక మల్ల నేను ఎవ్వరి మొఖం సూడ. నా మల్లవ్వమీద వొట్టు" అంటూ ఏడుస్తూ నర్సిమ్మ పాదాలు పట్టుకుంది.

నర్సిమ్మ మాట్లాడలేదు. మౌనంగా వుండిపోయాడు.బాలమ్మ ఎంత పట్టుదలగల మనిషో అతనికి బాగా తెలుసు.

అందుకే అప్పుడు మౌనం వహించాడు.

ఆ రాత్రంతా అతను నిద్రపోలేదు.

నిజానికతనికి బాలమ్మ అంటే ఎటువంటి అభిప్రాయంలేదు. అభిమానం, ప్రేమా అంతకన్నా లేవు.

అతను మంచి మేస్త్రి. పనితనంగల వ్యక్తి. కాని ఆడదాన్ని చూడగానే ఆలోచనలు వెర్రితలలు వేస్తాయి అతనిలో. అలా అని ఏ ఒక్క ఆడదానితో తృప్తిపడే రకంకాదు. అతని మనసు తుమ్మెద లాంటిది. పదిహేనేళ్ళ మేస్త్రి జీవితంలో బాలమ్మలాంటి స్త్రీలెందరో అతనికి తారసపడ్డారు. అందులో బాలమ్మ ఒకృతి.

ఈమధ్యే అతను ఓ యిల్లు కడ్తూ, ఆ యింటి యజమాని కూతురుతో సరసమాడబోయాడు.ముందుగా అంగీకరించినా తరువాత ఆ అమ్మాయి కాదని, ఇతను బలవంతం చేయబోవడంతో పోలీస్ రిపోర్టు యిచ్చింది. దాంతో నర్సిమ్మ పారిపోయివచ్చి బాలమ్మ యింట్లో తల దాచుకొని, బాలమ్మకోసం వచ్చాననంటూ అబద్ధాలు

చెప్పాడు.

అతను చెప్పిందంతా నిజమని నమ్మిన బాలమ్మ అతన్ని యింట్లోకి రానిచ్చి, రాజయ్యకు దూరంగా కావడమే కాదు పచ్చగా, సుఖశాంతులతో సాగిపోయే సంసారంలో నిప్పులు పోసుకుంది.

మరునాడు ఉదయానికి యింట్లో వున్న కొంచెం బంగారం డబ్బు తీసుకొని నర్సిమ్మ పారిపోయాడు. అతను వెళ్ళిపోయాక అతణ్ణి బాగా అర్థం చేసుకున్న బాలమ్మ బావురుమంది.

నర్సిమ్మ వెళ్ళిపోయిన వారంరోజులకు బాలమ్మ మామూలు మనిషైంది. అంతేకాదు నర్సిమ్మకు, రాజయ్యకు వున్న తేడా ఏమిటో నర్సిమ్మ రాజయ్యగురించి అన్న మాటలకు అర్థం ఏమిటో, తనపట్ల నర్సిమ్మకు వున్న అసలైన అభిప్రాయం ఏమిటో అర్థం అయింది బాలమ్మకు.

ఆమె మొండిగా ఓ నిర్ణయానికి వచ్చి, రాజయ్య దగ్గరికి వెళ్ళింది.

"దఫ్తరుకాడకెందు కొచ్చినవ్?" కంగారుపడుతూ అడిగాడు రాజయ్య.

"నువ్వింటికాడికి రాకపోతె నేనేం జేతుమరి?" అంది.

"నర్సిమ్మతో జెప్పినగద!"

"నువ్వు జెప్పింది నిజమని అందరిముందు చెప్పి వొప్పించు. కులపెద్దలను బిలిపిస్త ఖర్చయితెగాని....ఏదో దిక్కులేనోడిని ఇంట్ల వుంచుకుంటె నాకు ఆడికి సంబంధం అంటగట్టి, బూదిని తీస్కోని నువ్వెల్లిపోతె నాగతేం కావాల్ననుకున్నవ్? కులపోల్లను పిలుస్త. ఆల్లముందు నా తప్పేదో నా కొంగుల ఏసినంక నీ యిష్టం." అంది గట్టిగా ఏడుస్తూ.

"ష్....గట్టిగ వొర్లుతున్న వెందుకె....మెల్లంగ మట్లాడు." అన్నాడు రాజయ్య.

"నేనేది మాట్లాడిన నీకు వొర్లుతున్నట్టె గన్పిస్తది నాకెరిక... నువ్వు యిల్లు, యిడిసిపెట్టి ఎందుకు వోయినవో ఆ సివయ్య బిడ్డ కనకమ్మ"....ఆఖరి అస్త్రం వేసి ఊరుకుంది బాలమ్మ.

అంతే__

రాజయ్య హడిలిపోయాడు.

చేయని నేరం మీదపెడుతోంది బాలమ్మ.

తను చేసిన నేరం__నేరం కాదంటుంది. తానసలు నేరమే చేయలేదంటోంది. కుల పెద్దలను పిలిస్తే వాళ్ళముందు తానే దోషి అవుతాడుకాని బాలమ్మ కాదు. కాలేదు.

బాలమ్మకు నర్సిమ్మకు ఉన్న సంబంధం అందరిముందు సిగ్గు విడిచి తాను చెప్పినా, సాక్షులెవరు లేరు. ఉన్న ఒక్క నర్సిమ్మ అడ్రస్ తెలీకుండా మాయమై పోయాడు.

ప్రపంచం యిప్పుడు తననే నేరస్థుడిగా నిందిస్తుంది. కారణం తను పివయ్య యింట్లో వుండడమే. కనకమ్మ తనకు చెల్లెలిలాంటిదైనా అలా భావించదు. బాలమ్మ మాటలనే నమ్మేస్తుంది.

మల్లమ్మ పుట్టుక విషయంలో తన అనుమానం అందరి ముందు తనను నవ్వులపాలు చేస్తుందె తప్ప మరేంకాదు. ఏడేళ్ళుగా రాని అనుమానం ఈ నాడు నర్సిమ్మను చూసి చెబితె లోకం తననే తిడుతుంది తప్ప తన అనుమానాన్ని సమర్థించి బాలమ్మను దోషి అనదు. అనలేదు.

చివరికి కులపెద్దలముందు రాజయ్యనోరు నొక్కేసి, కాపురం చక్కదిద్దుకుంది బాలమ్మ.

ఆ నాటినుండి రాజయ్యమీద బాలమ్మ అజమాయిషి ఎక్కువైంది. ఇంట్లో అతని ఏ ఒక్క ఆలోచనను, సలహాను పాటించటం కాదు కాని అసలు వినేదికాదు. అతను చెప్పడానికి అవకాశమే యిచ్చేదికాదు. గయ్యిమంటూ మాట్లాడే బాలమ్మకు ఎదురు చెప్పలేక మౌనంగా వుండిపోయేవాడు రాజయ్య.

బాలమ్మ అతనికి ఒక భార్యలా అన్పించి, కోరిక రగిలించేది కాదు. దాదాపు అతని జీవితం ఆమెతో అన్ని విషయాలలో బంధాలను తెంచుకుంది. శారీరకంగా ఎటువంటి సంబంధం లేకుండా భూదెమ్మతో కాలం గడిపేసేవాడు రాజయ్య.

మానసికంగా రాజయ్యకు, బాలమ్మకు సంబంధం కాని అను

బంధం కాని ఏనాడూ లేదు. లోకం దృష్టిలో వాళ్ళిద్దరు భార్యా భర్తలు. కాని నిజానికి వాళ్ళు ఒక యింట్లో కలిసి బతుకుతున్నవాళ్ళు. వాళ్ళమధ్య కనీసం స్నేహం కూడా లేదు.

ఫస్టురాగానే జీతంరాళ్లు తీసుకొచ్చి,ఆమె కిచ్చేయటంతో అతని బాధ్యత ముగిస్తుంది. అంతే. మళ్ళీ ఆమెతో మాట్లాడే అవకాశం అతనికి వచ్చేదికాదు. వచ్చినా బాలమ్మ నోటి దురుసుముందు అతనేం మాట్లాడక మౌనంగా వుండిపోయేవాడు.

మల్లమ్మకు పధ్నాలుగేళ్ళు వచ్చాయి. చదువు ఏమాత్రం అబ్బలేదు. కనీసం అక్షరజ్ఞానం కూడా లేకుండాపోయింది. మూడు పూటలు తిండితింటూ, భూదెమ్మతో తగాదాలు పెంచుకుంటూ, ప్రక్కయిళ్ళ పిల్లలతో పోట్లాడుతూ, సాయంత్రం తల్లి యింటికి వచ్చేసరికి ఏదో ఒక గిల్లికజ్జా పెట్టుకొని భూదెమ్మను చావగొట్టిం చాలని చూసేది.

ఒక్కోసారి ఊరుకున్నా, ఒక్కోసారి భూదెమ్మ కూడా మల్లమ్మను చావచితక్కొట్టి పారిపోయి, సాయంత్రం రాజయ్య వచ్చాకా యిల్లు చేరుకునేది.

అన్ని విషయాలలో నోరువిప్పి పెదవిమెదిపి ఏం అనక పోయినా, భూదెమ్మ విషయంలో మాత్రం బాలమ్మను ఎదిరించే వాడు. ఒకసారి గట్టిగా మందలించడంతో బాలమ్మ భూదెమ్మను చేయి చేసుకోవడానికి వెనుకాడేది. చెయ్యి ఆడించకపోయినా, ఇష్టం వచ్చినట్టు బూతులు తిట్టి కసి తీర్చుకునేది.

ఓర్పు అనేదానికి హద్దువుంటుంది. అమాయకత్వానికి చివరి అంచు వుంటుంది. పదకొండేళ్ళ భూదెమ్మఈ హద్దులు దాటేసింది. బాలమ్మ ఏం తిట్టినా, మళ్ళి తిరిగి తిట్టడం బాలమ్మ లేనప్పుడు మల్లమ్మతో కుస్తీకి దిగి కొట్టడంలాంటివి చేసి, తనను తాను కాపాడుకునేది భూదెమ్మ.

పధ్నాలుగేళ్ళ మల్లమ్మకు పెళ్ళి కుదిరింది. ముందుగా బాలమ్మ చూసి ఒప్పుకున్నాకే రాజయ్యకు కుర్రాణ్ణి చూపించింది. రాజయ్య మౌనంగా తన అంగీకారాన్ని ఆమెకు వొదిలాడు.

ఉన్నదాంట్లోనే మల్లమ్మ పెళ్ళి ఏ లోటు లేకుండా రాకుండా ఘనంగానే చేసింది బాలమ్మ. దాచిన డబ్బంతా పెట్టి మల్లమ్మ అడిగినవన్నీ కొని కాపురానికి పంపించింది బాలమ్మ.

మల్లమ్మకు పదహారేళ్ళు దాటినవి.

రూపంలో తల్లి పోలిక రాకున్నా, గుణంలో మాత్రం తల్లి పోలిక వచ్చింది మల్లమ్మకు.

మల్లమ్మను ఎంతో ప్రేమగానే చూసుకునేవాడు చంద్రయ్య. వయసు తెచ్చిన సొగసులతోపాటు, మల్లమ్మ అందంగా వుండడం వల్ల, తాకితే కందిపోతుందన్నంత గారాబంగా చూసుకున్నాడు చంద్రయ్య.

అతను అనాకారి కాదు. అలా అని పెద్ద అందగాడూ కాదు. కాని....మల్లమ్మకు అతనంటే అంతగా యిష్టంవున్నట్టు కన్పించేది కాదు. ఏడాదికి తొమ్మిది నెలలు బాలమ్మదగ్గిరే గడిపేది. చంద్రయ్య ఒప్పుకోకపోయినా నోటి దురుసుతో చంద్రయ్య నోరు మూయించేది మల్లమ్మ. ఈ విషయంలో ఆమెకు తల్లి ఆదర్శప్రాయురాలైంది. చంద్రయ్య గోవులాంటి వాడనే చెప్పాలి. పైగా మల్లమ్మ అంటే చాలా యిష్టం. అందుకే మల్లమ్మను అదిలించే వాడుకాదు. తల్లి దగ్గరగా వున్నప్పుడు మల్లమ్మ చంద్రయ్యను చంద్రయ్య మాటను విలువయిచ్చి గౌరవించేదే కాదు. మల్లమ్మ చేసే ప్రతిపని బాలమ్మకు సమర్థనీయంగానే కనిపించేది.

కాని___

చంద్రయ్య గోవులాంటి వాడైనా, రాజయ్య కాదు. కాలేదు. నాలుగేళ్ళ కాపురంలో అతని ఓర్పు, సహనం దెబ్బతిన్నాయి. అతను మల్లమ్మను ప్రాణంకంటే ఎక్కువగా ప్రేమించాడు కాని,కుక్కకంటె హీనంగా చూస్తూ, అస్తమానం తల్లిదగ్గిరే వుండే మల్లమ్మ, తన యిల్లు తన సంసారం అన్న జ్ఞానం లేకుండా ప్రవర్తించడం రాను రాను అతనికి ఆమెపట్ల ఉదాసీన భావాన్ని పెంచాయి.

అష్టకష్టాలుపడి, తనను పెంచిన, తల్లిని, వొదిలి, యిల్లరికపు టల్లుడుగా బాలమ్మ దగ్గిరే పడివుండమని, మల్లమ్మ గొడవ పెట్టడం,

చంద్రయ్య వినకపోయేసరికి చంద్రయ్య తల్లితో తగాదాలు పడడంతో ఒకరోజు తగాదా పెరిగిపోయింది.

"నేను కావాలో మీ యవ్వ కావాలో చెప్పు" అంది మల్లమ్మ.

చంద్రయ్య వెనకడుగు వేయలేదు. మల్లమ్మను తేలిగ్గానే వొదులుకొని, యింకో పెళ్ళి చేసుకున్నాడు.

కుల పెద్దలంతా మల్లమ్మదే తప్పుగా నిర్ణయించారు. అప్పుడు గాని బాలమ్మకు తెలిసిరాలేదు.

ప్రపంచంలో ఎంతోమంది బాలమ్మలు వున్నా, అందరూ రాజయ్యలాంటి వారుకాదు అన్న నిజాన్ని గ్రహించిన బాలమ్మ ఈసారి చాలా దూరంగావున్న పల్లెటూళ్ళో ఓ రెండో సంబంధపు పెళ్ళి కుదిర్చింది మల్లమ్మకు.

భూషయ్య మొదటిపెళ్లాం ఎందుకోగాని ఉరేసుకొని చచ్చిపోయింది. కారణం—వాళ్ళ ఉమ్మడి కుటుంబపు కలతలే అని ఊళ్ళో వాళ్ళందరూ చెప్పి, భూషయ్య మంచివాడేనని చెప్పడంతో బాలమ్మ అంగీకరించింది.

ఈసారి కూడా రాజయ్య మౌనంగానే వుండిపోయాడు.

భూషయ్యకు మల్లమ్మకు చాలా నిరాడంబరంగా పెళ్ళి అయిందనిపించి కాపురానికి పంపించింది బాలమ్మ.

భూషయ్య లౌక్యం తెలిసిన మనిషి. మల్లమ్మ మొదటి మొగుడు చంద్రయ్య మల్లమ్మను వొదులుకోవడానికి కారణం బాలమ్మే అని చాలా త్వరలోనే గ్రహించాడు. మల్లమ్మ అచ్చంగా బాలమ్మ కూతురనడానికి సందేహించకుండా, ఒప్పుకొని ఏ ఎండకా గొడుగుపట్టే తత్వంతోపాటు, బాలమ్మ దగ్గర్నుండి కట్నాలరూపంలో కావలసినవి ఎలా వసూలు చేసుకోవాలో మల్లమ్మతో తానెలా ప్రవర్తించాలో, బాలమ్మతో అల్లుడిగా ఎలా మసులుకోవాలో అర్థం చేసుకున్నాడు.

అస్తమానం బాలమ్మ దగ్గరికి వెళ్ళాలంటూ బయలుదేరే మల్లమ్మను—వేరు కాపురంబెట్టి కదలకుండా చేశాడు.

అసలే ఉమ్మడి కుటుంబం. పోట్లాడి వేరుకాపురం బెడితే,

ఆలనా పాలనా చూడరు మిగతా వాళ్ళెవ్వరు. ఈ యింటిమీది కాకి ఆ యింటిమీదికి వాలదు. అలాంటప్పుడు భూషయ్యకు భోజనం విషయంలో ఇబ్బంది అయ్యేది.

"నిన్ను పెండ్లి చేసుకున్నాక, నీ మాటమీద విడిసంసారం పెట్టుకున్నాక, నువ్వు అవ్వ....అవ్వ అంటూ అవ్వ దగ్గరకిపోతే నాకు వండిపెట్టేదెవరే" అంటూ నిలదీసి అడుగుతూ ఆపేసేవాడు.

అదేంటని బాలమ్మ అడిగే అవకాశం లేకపోయింది.

భూషయ్య పొలం పనిచేస్తూ, మల్లమ్మను తీసుకుపోయేవాడు. మల్లమ్మ కలుపుకుపోయి, కూలిడబ్బులు సంపాదించేది. మొదట్లో రానని అన్నా, ఆ డబ్బుతో స్వంత యిల్లు కట్టుకుందాం అని, మిగతా వాళ్ళందరిలో చులకనకాకుండా గొప్పగావుందాం, అలా అయితే ముందుగా కొంచెం కష్టపడాలి అంటూ మల్లమ్మకు నచ్చ చెప్పి పొలం పనులకు పంపించేవాడు భూషయ్య.

"నా బిడ్డ కష్టమేందో తెల్వకుండ పెరిగింది" అంది మల్లమ్మను చూడ్డానికి వచ్చిన బాలమ్మ.

దానికి భూషయ్య అందంగా నవ్వాడు.

"అత్తమ్మా! ఇది అత్తగారిల్లు. నీ బిడ్డమాటయిని నేను వేరుపడ్డ. మా అన్నలందరు, ఆడోళ్ళందరూ కలిసి కష్టపడి సంపాదిస్తుంన్రు ఎందుకు? యిప్పుడు ఎవ్వని సంసారం ఆల్లకు అయింది. పొరగాల్లు పుట్టుకొస్తుంన్రు. మరి యిట్లనేవుంటే రేపటికి పోరలకు మిగిలేదేంది?

"ఏదో యిప్పుడే కష్టపడి సంపాదిస్తే ఓ యిల్లు కొంచెం పొలం కొనుక్కుంటే మంచిదేగదా! నీ బిడ్డను కష్టపెట్టాలని నాకు ఇష్టవా! కాని సంసారం. రేపో మాపో పిల్లలు పుడితేకూడు ఎవ్వరు పెడ్తరు. నీ బిడ్డను నువ్వు సుఖంగా, కష్టం తెల్వకుండా పెంచినవ్ కాని నువ్వు కష్టపడ్డావ్. మరి మేమూ మా పిల్లలను సుఖంగా, కష్ట మెరుగకుండా పెంచాలే. మరి మేం కష్టపడాలే. అవునా?

"అయినా నీ బిడ్డ కలుపుపైసలన్నీ గుండ్లుచేయించు కుంటా నంటే సరేనన్న. నాకు పెట్టమన్నానా!" అన్నాడు.

అతడి మాటలకు ఏం అనాలో తెలీక, మల్లమ్మకే ఎందుకు కష్టపడాలో చెప్పి, ఓదార్చి వచ్చింది బాలమ్మ.

తల్లికూడా, అలా చెప్పడంతో, మల్లమ్మ తన బాధ ఎవరితో చెప్పుకోవాలో తెలీక, భూషయ్య చెప్పినట్టు వినడానికే నిశ్చయించు కుంది.

భూదెమ్మకు పెళ్ళి కుదిరింది.

పెళ్ళికొడుకు పేరు నారయ్య. తల్లి తండ్రికి రెండో కొడుకు. నారయ్యకంటే పెద్దవాడికి, ఇద్దరాడ పిల్లలకు పెళ్ళిలు అయి పోయాయి. నారయ్య తరువాత యింకో అమ్మాయి పెళ్ళీడుకు వచ్చింది.

ఈ సంబంధం రాజయ్య తమ్ముడు తీసుకొచ్చాడు. ఆ సంబంధం రాజయ్యకు అన్నివిధాల నచ్చింది. పైగా నారయ్యను ఇల్లరికం తెచ్చుకోవడానికి వాళ్ళింట్లోవాళ్ళు అంగీకరించారు.

"బూది కాలు లచ్మికాలు. అది పుట్టినంకనే మన నసీబుమారింది. నాలుగు పైసలు కూడ పెట్టుకున్నాం. ఊళ్ళో యింత పొలం కొనుకున్నాం. దాన్ని బయటికి యిస్తే బాగుండదు బాలి" అన్నాడు రాజయ్య.

అందులో అతని స్వార్థం కూడా వుంది. కూతురంటే పడి చచ్చే అభిమానం వుంది.

బాలమ్మ ఏమీ అనలేదు. రాజయ్య మాటల్లోని స్వార్థం అర్థం అయినా అతని మాటల్లోని నిజాన్ని కూడా అర్థంచేసుకుంది.

పైగా నారయ్య మొహంచూస్తుంటే అమాయకుడిలా కన్పిం చాడు. బాలమ్మ పెట్టే షరతులన్నింటికి ఒప్పుకున్నారు నారయ్య తల్లితండ్రులు. దానికి కారణం నారయ్యకున్న పెళ్ళికాని చెల్లెలే.

నారయ్యవాళ్ళది చాలా పేదకుటుంబం. పేరుకు కొంచెంకూడా ఆస్తిలేనివాళ్ళు. ఆ ఊరి మునసబుగారి పొలంలో పాలేరుగా పని చేస్తున్న నారయ్య తండ్రి జీవితం వెట్టి చాకరితోనే తెల్లవారేలా వుంది. ఆయన పెద్దకొడుకు, ఓ షావుకారి పొలం కౌలుకు తీసు కున్నాడు. వాళ్ళ సంపాదన కనీసపు అవసరాలను తీర్చలేనిది.

ఎలాగో ఇద్దరాడపిల్లల పెళ్ళిలు అయిందనిపించారు. షాపు కారు దగ్గర పన్నెండు వందలకుపైగా అప్పుపడి వున్నారు.

నారయ్యను ఇల్లరికానికి పంపిస్తే నగదు రూపాయలు వెయ్యి వెంటనే యిస్తానని రాజయ్య అనడంతో నారయ్య తండ్రి నారయ్యను సంప్రదించకుండానే అంగీకరించి మాట యిచ్చేసాడు.

నారయ్య కాస్త అందగాడనే చెప్పాలి. మనిషి రంగు ఎరుపు, కండలు తిరిగిన శరీరంతో నిండుగా వుండే నారయ్య, భూదెమ్మను పెళ్ళి చేసుకోవడానికి ముందుగా అంగీకరించలేదు. ఇల్లరికం వెళ్ళ దానికి అసలు ఒప్పుకోలేదు.

కాని నారయ్య తండ్రి యింటి పరిస్థితి, పెళ్ళికెదిగిన చెల్లెలు గురించి చెప్పడంతో ఇష్టంలేకున్నా, ఒప్పుకున్నాడు.

నారయ్యకు భూదెమ్మకు పెళ్ళి ఆడంబరంగానే జరిగిపోయింది.

నారయ్య కాపురానికి వచ్చేసాడు.

ఊళ్ళో పొలం పనులు నేర్చుకున్న నారయ్యకు పట్నం రావడంతో నిరుద్యోగ సమస్య ఎదురైంది.

కొత్తలో, ఓ మూడునెలల వరకు, అతను వేళకు తింటూ, రోడ్లు సర్వేచేస్తూ హాయిగా గడిపేసాడు.

నల్లగా వున్నా పెద్ద పెద్ద కళ్ళతో, చిరునవ్వు నవ్వుతూ, కళగా కనిపించే భూదెమ్మను ప్రాణంగానే చూసుకున్నాడు.

రాజయ్య, వాళ్ళిద్దర్నీ చూసి మురిసిపోయాడు. అతనికి అల్లుడు నిరుద్యోగి, యింట్లో కూర్చొని తింటున్నాడన్న ధ్యాస బాలమ్మ అనే వరకూ తట్టలేదు.

ఆ వెంటనే అల్లుడికోసం అతను, ఉద్యోగం వెతకడం మొదలుపెట్టాడు.

భూదెమ్మకు వున్న అక్షరపరిజ్ఞానంకూడా లేని నారయ్యకు ఉద్యోగం దొరకడం కష్టమే అయింది.

పోనీ ఏదైనా కూలిపనికి పంపిద్దాం అంటే అతని మనసు అంగీకరించలేదు.

కాని బాలమ్మకు అలాంటి పట్టింపులేం లేవు. నారయ్యను, ఓ

కాంట్రాక్టరు దగ్గిర పనికి కుదిర్చింది. కొత్త యిళ్ళకు, ఆఫీసులకు, ఫ్యాక్టరీలకు నీళ్ళపంపులు అమర్చే కంట్రాక్టు తీసుకునే ఆ కంట్రాక్టరు దగ్గిర వుండే మేస్త్రీ దగ్గర నారయ్య పనికి కుదిరాడు. రెండేళ్ళు గడిచేసరికి, అతనికి పని పూర్తిగా వచ్చేసింది.

ఈ మధ్యకాలంలో భూదెమ్మకు ఒక ఆడపిల్ల, మల్లమ్మకు ఒక మగపిల్లాడు పుట్టారు.

అంతేకాదు, మల్లమ్మకు, భూదెమ్మకు కల తేడా, వాళ్ళిద్దరికి తల్లి యిచ్చే విలువలతేడా, యింటి పెద్ద అల్లుడిగా భూషయ్యకు యిల్లరికపుటల్లుడిగా జరిగిన మర్యాదలు త్వరలోనే అర్థం చేసుకున్నాడు నారయ్య.

ఆ యింట్లో బాలమ్మ రాజయ్యకిచ్చే విలువ, గౌరవంతోపాటు ఆ యింట్లో ఆడపెత్తనం ఎంతవరకు వుందో పెళ్ళయిన నెలరోజుల్లోనే గ్రహించాడు.

అతనికెందుకో బాలమ్మనుచూస్తే అత్తగారు అనే గౌరవం ఏమాత్రం వుండేదికాదు. ఆవిడ అంటే ఓ విధమైన భయం బెరుకుతో పాటు అసహ్యం కలిగేది అతనికి. రాజయ్యను భర్త అనికూడా గౌరవించకుండా, బూతుమాటలు తిట్టే బాలమ్మ అతనికి ఒక అణుకువ కలిగిన ఆడదానిలా కన్పించేది కాదు. చుట్టుప్రక్కల వాళ్ళున్నారన్న విచక్షణ లేకుండా, గయ్యిమంటూ రాజయ్యమీదికి నోరు పారేసుకొని ప్రతి చిన్న విషయాన్ని రాద్ధాంతంచేస్తూ, పోట్లాటకు దిగే బాలమ్మ అంటే అతనికి ఏవగింపులాంటి భావం కలిగేది.

అందుకే చాలావరకు ఆమెతో మాట్లాడకుండా వీలైనంత దూరంగా వుండేవాడు. కాని బాలమ్మ నోరుమాత్రం ఊరుకునేదికాదు.

నారయ్యకు రాజయ్య అంటే జాలి తప్ప మరే భావంలేదు. గయ్యాళి భార్య నోటికి జడిసి మౌనంగా వుంటాడో లేక, లోకానికి భయపడి నోరు మూసుకుంటాడో, అసలు తానో మగవాడినని బాలమ్మకు భర్తనన్న విషయం మరిచి ఊరుకుంటాడో అర్థంకాలేదు.

ఒక్కోసారి తన తప్పులేకున్నా, రాజయ్య దోషిలా మౌనం వహించడంచూసి, ఆ క్షణంలో రాజయ్య అంటే జాలిపడడంపోయి,

చాతకానివాడన్న చులకన భావంతోపాటు, కోపం వచ్చేవి.

"ఎందే మావా ఊకుంటవు. నీ తప్పేంలేదని జెప్పరాదు." అని నారయ్య అంటే—

"నా తప్పు లేకున్నా అదట్ల వొర్లుతనె వుంటది. వొర్లని. దానికి ఆదత్ అయిపోయింది వొర్లుడు" అంటూ జవాబుచెప్పే రాజయ్య మాటలకు నిర్ఘాంతపోయేవాడు.

"అదికాదు మావా! అన్ని కారుకూతలు కూస్తుంటే, వంగవెట్టి నాలుగు తంతె...."

"నా ఇజ్జత్ పోతదిరా నారయ్యా! నీకు తెల్వదు మీ అత్తమ్మ ఎసువంటి ఆడదో. మొగున్ని కొట్టి మొరవెడ్తది. నేను ఒక్క దెబ్బ కొట్టిన్నే అనుకో! మల్ల ఎగవడి నన్ను కొడ్తది. మల్ల పదిమంది ముంగల నన్ను తప్పులవెడ్తది. దాని బుద్ధి నాకెరికె" అంటూ పైకి అనలేక లోలోపలే గొణుక్కునే రాజయ్యను చూసి నారయ్యకు కోపంతోపాటు జాలికలిగేది.

మల్లమ్మ, భూదెమ్మ నెల తేడాతో తల్లులయ్యారు. బారసాల విషయంలో కూడా బాలమ్మ ఇద్దరి కూతుళ్ళమధ్య చాలా వ్యత్యాసాన్ని, కానుకల విషయంలో తేడాలు స్పష్టంగా కనపరిచింది.

ఆ విషయంలో రాజయ్య, నారయ్య లోలోపలే బాధపడ్డా, భూదెమ్మ మాత్రం పైకి అనేసింది.

దాంతో ఆరోజు పెద్ద యుద్ధం లాంటిదే జరిగింది. ఆ యుద్ధంలో బాలమ్మ, మల్లమ్మ కలిసి భూదెమ్మను, నారయ్యను అనరాని మాటలు అన్నారు.

భూదెమ్మకు ఆడపిల్ల పుట్టడం మొదటి తప్పుగాను, ఆడపిల్ల పుట్టినందుకు నోరు మూసుకోకుండా, తగుదునమ్మా అని బాలమ్మను విలేసినందుకు రెండో తప్పుగాను, ఏమాత్రం సంపాదించని నారయ్య లాంటివాణ్ణి కట్టుకోవడమే కాక, కూతురును కనడం మహా పాపంగాను తలచి నిందించారు.

"అసలు తప్పంతా ఆ గుడ్డి ముండాకొడుకుది! ఇదేందో లచ్చిమి పుత్తురురాలని అల్లున్ని యిరిటం' తెచ్చుకున్నాడు. ఎద్దును

మేపినట్టు మేపటం తప్ప గవ్వ అద్దాని లేదు. ఇంక దీనికెంత నీల్గుడు. సీరె మంచిగ లేదంటా! మొగాడు నూర్లు సంపాయిస్తుండు. దీనికి మంచి సీరె నేను తేకపోతినంట. అడగనీకె సిగ్గన్న లేకపోయె ....నీ అయ్యేసు తెమ్మను ముక్కింత పొద్దుగ్గా నీ లగ్గం జేసిందు గద" అంది బాలమ్మ.

ఆరోజునుండి నారయ్య అంటే కోపం పెరిగిపోయింది బాలమ్మకు. అసలు మొదటినుండి నారయ్య అంటే ఆమెకు గిట్టేది కాదు. దానికి కారణం నారయ్య చేసిన తప్పేంలేదు. అతను భూదెమ్మకు మొగుడు కావడం అతని దురదృష్టం అంతే. పైగా భూదెమ్మను ప్రేమగా చూసుకుంటూ, రాజయ్యతో మంచిగా వుండే నారయ్యను చూస్తుంటే, ఆ యింట్లో తనకు ఇష్టంలేని వ్యక్తులు ముగ్గురు తన బద్ధ శత్రువుల్లా కనిపించేవారు.

అంతేకాదు ఆ ముగ్గురు ఒక్కటై ఏనాడో ఒకనాడు తనని ఏమో చేస్తారన్నఅనుమానం ఆమెను పీడించేది. వాళ్ళుముగ్గురు ఒక్క మాట మాట్లాడితే తాను ఒక్కతే ఏం చేయలేదన్న భయం లోపల వున్నా, పైకి మాత్రం ఆ ముగ్గురిమీద అజమాయిషీ చలాయిస్తూ, తన నోటి ధాటితో వాళ్ళ నోర్లు మూయించేది.

కాని రాజయ్య మౌనం. నారయ్య తనకు దూరంగా తిరగడం ఒక్క భూదెమ్మ తనను ఎదిరించి మాట్లాడ్డం చూసి అప్పుడప్పుడు భయపడే మనసును ఓదార్చుకున్నా, ఆమెలో ఏ మూలో ఏదో భయం దిగులు కలిగేవి.

రోజులు గడుస్తున్నకొద్దీ నారయ్య ప్రతి చిన్న విషయాన్ని ఎత్తిచూపుతూ, పరోక్షంగా బాలమ్మను నిందించేవాడు. కట్టుకున్న భర్త మాట్లాడకపోయినా, తను పెట్టే కూడు తింటూ తన కెదురు తిరిగే నారయ్యను ఎలా లొంగదీసుకోవాలో అర్థంకాక చాలారోజులు ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది బాలమ్మ.

అనాటినుండి ఆమె భూదెమ్మను ఆదరించడం, మంచిగా మాట్లాడ్డం, తిట్టకుండా ఉండడం చేసింది.

రోజూ ఉదయం, సాయంత్రం వంటపని యింటిపని అంతా

భూదెమ్మనే చేసేది. ఆ చేసిన పనికి వంకలు పెడుతూ, రోజుకొకసా
రైనా తిట్టే బాలమ్మ తిట్టడం మానేసింది.

"కట్టం చేస్తే తెలుస్తది పైస యిలువ. కూకొని తింటే ఏం తెలుస్తది. సెమట వోడ్సి సంపాదిత్తె గుర్తుంటది. ఎట్టా ఖర్సు సేయాల్నో. అవ్వ జాగీరుందని, కుండలనిండా వండి వారిస్తె మిగిలిందంతా ఏంకావాలని? నా యిల్లు దోస్తున్నారు. నా బిడ్డకేం మిగల నీయరు" అంటూ, ఏరోజైనా కాసింత పప్పో, చారో. కంపువాసన వేసీ పారేస్తే గొణిగి, సణుక్కునే బాలమ్మ అవన్నీ మానేసింది.

"ఇగనె బూది! ఇయ్యాల నేనుంటా! రేపు నేనుంటానా? యియ్యాల కాకుంటె రేపు ఎట్లన్న నేను కాటికి వోతా. ఈ సంసారం అంతా ఎవరికొస్తది. నీకు, నీ మొగనికి, నీ పిల్లలకు. బాగు చేసుకున్న నీది, సెడగొట్టుకొని సిప్పలు చేతుల వట్టుకున్న మీకె. నాకేంది? బతికినన్నాళ్ళు యింత గంజినీళ్ళు పోస్తె సాలు" అంటూ బాలమ్మ అనడంతో భూదెమ్మ ఆలోచన్లో పడిపోయింది.

"అవును. అవ్వ సెప్పింది నిజమే. సంసారం నాకె వుంటది మరి ఇరిటం తెచ్చుకున్నారుగా. మంచిగ సూస్కోవాలె. ఎక్కువ తక్కువ ఖర్చు సెయ్యొద్దు" అనుకుంది.

"ఇగనె బూది! నాకు నారయ్య అంటె కోపంగాదు. అల్లుడైనా కొడుకైనా నారయ్యనే. ఇరిటం తెచ్చుకున్నంక రేపు ఏం జస్తె ముంగట నడిసొటోడు నారయ్యనే. అందరు అడుగుతుండ్రు- అల్లుడేం సంపాదిత్తుండని. ఏం జెప్పాల్నో తెలుస్తలేదు. నువ్వన్న జెప్పరాదె ఏదన్న పని జూసుకోమని...." అంది బాలమ్మ భూదెమ్మతో.

ఈమధ్యనే నారయ్య మేస్త్రీతో తగువుపెట్టుకొని ఉద్యోగం వొదులుకున్నాడు. తనే స్వంతంగా ఎక్కడైనా పని చూసుకోవాలని తిరుగుతూనే వున్నాడు.

వేళకు తింటూ, వెళ్ళిపోతున్న నారయ్యను ఏమీ అనలేక, మళ్ళీ తల్లి కాబోతున్న భూదెమ్మను మందలించలేక, మెత్తగానే చెప్పింది బాలమ్మ.

తల్లి మాటలు విన్న భూదెమ్మకు నిజమే ననిపించింది.

"నిజమే! యిరిటం తెచ్చుకున్నంక, ఈ యింటికి కొడుకైనా అల్లుడైనా నారయ్యే. ఇలా కొలువు లేకుండా తిరిగితె ఏంబాగుంటది? సూపినోళ్ళంతా ఏమనుకుంటరు? ఆడిదాని సంపాదన తింటుండని నారయ్యను ఎక్కిరిస్తరు. నారయ్యను ఎక్కిరిస్తె తనను ఎక్కిరించి నట్టెమరి. అందుకే జల్దీ ఏదన్న పని సూసుకోమని చెప్పాలి నారయ్యకు" అని అనుకున్న భూదెమ్మ ఆరోజునుండి నారయ్యను మెత్తగా, ఇనకపోతే గట్టిగాను మందలించడం మొదలుపెట్టింది.

"ఏందే బూది? రోజు రోజుకు నీ యవ్వ....నీ యవ్వారం అంతా ఎందో అయితుంది? నేనేం మీ అయ్యననుకున్నావా మీ అవ్వ వొర్లుతుంటే ముగిలెక్క వుంటననుకున్నావా? పంగవెట్టి నాలుగు తంతే—" అన్నాడు.

"అదితప్ప నీ కింకేం సాతనైతది నారయ్య! పిల్లను అందుకే పెండ్లి జేస్తిమి. మా సొమ్ము తినుకుంట మా పిల్లను తన్న కునే నీకు కూడువెడ్తున్నమాయే" అంటూ తన కసితీరేలా తిట్టి—

"అల్లుడివై ఈ యింటికి వచ్చినపుగాని, కోడలితీరితిని కూకుంటున్నావ్ కట్టం, నిట్టూరం జాతనైతలేదు. మేం ముసలోల్లని యిద్దరం ఎంతకాలం సంపాయించిపెడ్తుము? నీ పెల్లాని పిల్లను తీసు కొని నువ్వేరుగా వుండు అప్పుడు తెలిసొస్తది" అంది బాలమ్మ. భూదెమ్మ బావురుమంది బాలమ్మ మాటలకు.

"ఇగో బాలీ! ఆడు కొలువుసెస్తలేడని అణ్ణి పొమ్మంటున్నవ్ బానే వుంది కాని బూది గతేం గావాలె. వొట్టిమనిషి కూడా కాదాయె. రేపో మాపో ఆడికి మా దప్తరులోనే కొలువు వస్తది ఊకో!" అంటూ బాలమ్మకు నచ్చచెప్పి, భూదెమ్మను ఓదార్చాడు రాజయ్య.

మరో రెండు నెలలకు నారయ్యకు గవర్నమెంటు ఉద్యోగం దొరికింది. అదీ రావడానికి ఐదువందలవరకు అయిన ఖర్చు, రాజయ్యే పెట్టుకున్నాడు.

ఈసారి తనకు కొడుకు పుట్టాలని వెయ్యి దేవుళ్ళకు మొక్కు కుంది భూదెమ్మ. కాని వెయ్యి దేవుళ్ళలో ఏ ఒక్క దేవుడు ఆమెను

కరుణించలేదు. చివరికి కూతురునే కన్నది.

మల్లమ్మ రెండోసారి పురిటికి వచ్చి ఆడపిల్లనే కన్నది. ఇద్ద రిక బారసాల మామూలుగా చేసి పంపించింది బాలమ్మ.

"అవ్వా! నీ అల్లుడు యింటికోసం జాగా కొన్నడు. యిల్లు కట్టుకుందామనుకుంటున్నం. ఊళ్ళో మన్నుకు తకిలీబులేదు గాని యిట్కె కొనాలె" అంటూ నసిగింది మల్లమ్మ.

మూడు జీతాల్లోనుండి దాచిన డబ్బులో ఓ వెయ్యిరూపాయలు ఎవరికి చెప్పకుండా మల్లమ్మకిచ్చి, అందరికి తెలిసేలా ఓ రెండు వందలు చేతుల్లో పెట్టి అంతకంటె యింక లేవంది బాలమ్మ కళ్ళు తుడుచుకుంటూ.

ఎవ్వరికీ విషయం తెలియకూడదనుకుందో సరిగ్గా ఆ నారయ్యకే విషయం తెలిసింది.

చెల్లెలి పెళ్ళి నిశ్చయమైందని రమ్మంటూ రాయడంతో, భూదెమ్మతో ముందుగా ప్రయాణమై పోయాడు నారయ్య.

"చెల్లెలి లగ్గానికి ఏంబెడ్తున్నవ్?" తండ్రి మాటలకు ఓ వంద రూపాయలు చేతిలో పెట్టేడు.

"యింతేనా?" అన్నాడు విస్తుపోయాడు తండ్రి.

బాలమ్మ తత్వం చూచాయగా చెప్పాడు నారయ్య.

"నిన్ను యిరిటం ఎందుకిచ్చినంర్రా? ఆ యింటికి యజమానివి, మగదిక్కువు, కొడుకువు నువ్వే కావాలనిగాని, ఓ ఆడదానికి భయపడి పొమ్మనికాదు. నువ్వు సంపాయిస్తవు. నీ మామ సంపాయిస్తడు నీ అత్త సంపాయిస్తది. తినంగ మిగిలింది కూడవెట్టి పెద్దబిడ్డకు పంపుతుంది నీ అత్త."

"యిల్లు గట్టుకుంటనంటె ఎయ్యి రూపాయలు సేతులవోసి పంపింది. నా బిడ్డ లగ్గానికి నీసేత ఈ నూర్రూపాయలు పంపినాది? ఆ యింట్లో నీ యిట్టం, నీ పెల్లాం యిట్టం ఏంలేవు అంతా నీ అత్త యిట్టమేనా?" కాస్తా గట్టిగానే అడిగాడు నారయ్య తండ్రి.

తండ్రి చెప్పే మాటలు విని తెల్లబోయాడు నారయ్య.

"అవ్వతోడు....నాకు తెల్వదె" అన్నాడు నారయ్య వెర్రి

మొహంవేసుకొని.

కొడుకు వెర్రిమొహం చూసాకా నారయ్యా తండ్రికి నిజంగానే కొడుకుకేం తెలవదన్న నిజం, భూదెమ్మ మరీ అమాయకురాలన్న విషయం తెలిసి బాధపడిపోయాడు.

నారయ్యా తండ్రి పల్లెటూరివాడే అయినా తెలివిగలవాడు. ఆవలిస్తే పేగులు లెక్కపెట్టే రకం. మల్లమ్మ వుండే ఊళ్ళో అతని పెద్దకూతురూ వుంటుంది. ఆ అమ్మాయిద్వారా మల్లమ్మ భూషయ్యా యిల్లు కట్టుకుంటున్నారని తెలిసి ఆరాతీసాడు.

మల్లమ్మ భూషయ్యకూడా పెళ్ళికి వచ్చారు.

పెళ్ళంతా అయిపోయినాకా, పదిమందిలో పంచాయితి పెట్టించాడు నారయ్యా తండ్రి.

కాని బాలమ్మకున్న తెలివితేటల విషయం వాళ్ళెవ్వరు అంచనా వేసుకోలేదు ఒక్క రాజయ్యా తప్ప.

భూషయ్యా అన్నతమ్ములు ఈ విషయం తెలిస్తే ఓర్వలేరని, బాలమ్మ యిచ్చిందన్నట్టుగా ఊళ్ళో చెప్పుకొని యిల్లు కట్టుకున్నట్టు భూషయ్యా పదిమందిలో సాక్ష్యం యిచ్చేసరికి అందరి నోళ్ళు మూతపడ్డాయి.

వచ్చిన పదిమంది నారయ్యాను నిందించి వెళ్ళారు. పంచాయితి పెట్టినందుకు వచ్చిన పెద్దలకు, ఓ కల్లుకుండ తెప్పించే ఖర్చు నారయ్యామీదే పడింది.

జీతం తీసుకువెళ్ళే బాలమ్మ వాళ్ళేపోసె నారయ్యాకు అప్పటి కప్పుడు వందరూపాయలు ఎక్కడ్నుంచి తేలేక, భూదెమ్మ మీదున్న చెవుల కమ్మలు కుదువపెట్టి డబ్బు తీసుకొచ్చాడు.

"మొగోడు...జేబు దులిపితే గవ్వలేదు. పంచాయితి పెడ్తడు.. వీని అవ్వ సొమ్మనా కమ్మలు కుదువబెట్టిండు. అది నా సొమ్ము నా బిడ్డకు నేను పెట్టిన సొత్తు....నాది. నన్ను అడగకుండా కుదువ బెట్టిండు... వీని మొఖానికి పెళ్లానికి తులం బంగారం కొనిచ్చినాడు?" అంటూ తాగిన మైకంలో బూతులు తిట్టింది బాలమ్మ.

నారయ్యా తండ్రి వింటూ మౌనంగా వుండిపోయాడు.

కొడుకును ఇల్లరికపు టల్లుడిగా పంపించే ముందు తన పేద కుటుంబాన్ని ఏ విధంగానైనా నారయ్య ఆదుకుంటాడని ఆశించాడు. రెండేళ్ళు కొడుకుకు ఉద్యోగం లేక, ఏం అడగలేకపోయాడు. కాని కొడుకు గవర్నమెంటు ఉద్యోగం చేస్తూకూడా ఆ యింట్లో గవ్వ విలువచేయలేక పోతున్నదంటే, యిక ముందు ముందు తనకు తన పేద సంసారానికి ఏ విధంగాను ఆసరా కాలేదని తెలుసుకున్నాడు.

ఆ నాటితో బాలమ్మకు నారయ్య అంటే కసి, ద్వేషం పెరిగి పోయాయి.

పదిమందిలో తనను దోషిలా నిలబెట్టాలని చూసిన నారయ్య తలక్రిందికి వాలిపోయేలా చేసినా, ఆమెకు అతనిమీద కోపంపోలేదు.

భూషయ్య తనను అర్థంచేసుకోవడమే కాదు. పదిమందిలో తన పరువు పోకుండా ఆదుకున్నాడు. అబద్ధం చెప్పి పదిమందిలో తనను నిర్దోషిలా నిలబెట్టాడు అన్న అభిమానం పెరిగిపోయింది భూషయ్యపైన.

అందుకే మల్లమ్మ ఎప్పుడు ఉత్తరం రాసినా, ఏ మనిషిని పంపినా చాటుగానో, మాటుగానో డబ్బు పంపించేది. రాజయ్య గమ నించినా, గుర్తించినా, మౌనంగా నిర్లిప్తంగా వుండిపోయాడు.

పది సంవత్సరాలు గడిచిపోయాయి.

కాలం తెచ్చిన మార్పులు ఎన్నో... ఎన్నెన్నో....

కాని___

బాలమ్మను ఏమాత్రం మార్చుకోలేకపోయాయి.

ఆమె ఎప్పటికీ బాలమ్మలానే మిగిలిపోయింది.

రాజయ్య - రాజయ్యగానే వుండిపోయాడు.

నారయ్యలో నలుగురాడపిల్లలను గన్న తండ్రికుండే నీరసం, కొడుకు పుట్టాలన్న ఆశ, మిగిలిపోయాయి.

భూదెమ్మ రాజయ్య కూతురే అయినా, నోరు పారేసుకోవ డంలో బాలమ్మ కూతురని ఒక్కసారి జ్ఞాపకం వచ్చేలా ప్రవర్తించేది.

భూదెమ్మకు నలుగురాడపిల్లలు పుట్టారు.

ఐదోసారి నీళ్ళోసుకుంది.

మల్లమ్మకు ఇద్దరాడపిల్లలు, ముగ్గురు మగబిడ్డలు.

మళ్ళీ పిల్లలు పుట్టకుండా, ఉన్న ఊళ్ళోనే ఏవో మూలికల మందు తాగేసింది.

మాదంటూ ఓ ఐదుగదులు యిల్లు, నాలుగెకరాల పొలం, డబ్బెవరిచ్చినా, భూషయ్య తన ఊళ్ళో ఓ కుటుంబస్తుడిగా కాస్తా యిల్లు పొలంకల వ్యక్తిగా నిలబెట్టాయి.

ఎటూకాకుండా, ఏం లేకుండా మిగిలిపోయింది ఒక్క నారయ్య భూదెమ్మలే.

బాలమ్మ దాచిన డబ్బంతా మల్లమ్మకే పంపుతుందన్న విషయం నారయ్యకు బాగా తెలుసు.

పైగా భూదెమ్మ ప్రతిసారి ఆడపిల్లనే కంటుంది. మగపిల్లాడు పుట్టి ఉద్ధరిస్తాడన్న ఆశలేదు నారయ్యకు.

"ఓ పాలి. దవఖానకు తీస్కపో.... పెయిల సుస్తుగుంది" అంది బూదెమ్మ. రాజయ్య కూడా అనడంతో బయలుదేరాడు నారయ్య.

హాస్పటల్‌లో చూపించి సుస్తీ వుండడానికి కారణం ఏమిటో తెలుసుకున్నాడు నారయ్య.

బూదెమ్మ ఐదోసారి నీళ్ళోసుకుందని.

ఆ విషయం హాస్పటల్‌కు రాకముందే బూదెమ్మకు తెలుసు. కాని నారయ్యతో ముఖ్యంగా బాలమ్మతో జెప్పే ధైర్యంలేక కడుపులో నొప్పని చెప్పింది.

డాక్టర్లు కడుపులో నొప్పికి మందుయిస్తే ఏదైనా జరగరానిది జరుగుతుందని ఆశించింది. కాని, డాక్టరు పరీక్షించి ఏవో మాత్రలు యిచ్చి అసలు విషయం చెప్పాడు.

విషయం డాక్టరుద్వారా విన్న నారయ్య ఏం అన్లేదు. కొంచెం సంతోషించినట్టే కనిపించాడు.

"నాతో సెప్పలేదేందే?" అన్నాడు బయటికి వచ్చాక బూదెమ్మతో.

"నాకు బుగులయ్యిందయ్యా" అంది బెదురుగా బూదెమ్మ.

"ఒస్సి....ఎందుకె...." అంటూ నవ్వి, యీసారైనా నరిసిమ్మసామి దయుంటె కొడుకు పుట్టాలనె బూది....నీ యవ్వ.... మీ అవ్వ మొఖం పిన్నవోతది" అన్నాడు నవ్వుతూ.

బూదెమ్మ తేలిగ్గా ఊపిరి పీల్చుకొని, మనసులో నారయ్య కోరుకున్న కోరికనే తనూ కోరుకుంది.

"నాకు కొడుకు పుడితె నీ పేరె పెట్టుకుంట దేవుడా! నీ దగ్గరకువచ్చి గుండు జేయిస్త, ఆస నిరాస చేయకుండా కొడుకునియ్యి" అని మొక్కుకుంది.

అలా నడుస్తూ నడుస్తూ అఫ్జల్‌గంజ్ దగ్గరికి వచ్చేసరికి వరసగా కూర్చున్న చిలకశాస్త్రం వాళ్ళను చూసి ఆగిపోయాడు నారయ్య. అతని మనసులో ఏదో తెలుసుకోవాలని ఆరాటం బయలు దేరి బూదెమ్మను కూర్చోబెట్టాడు.

దగ్గరున్న కాగితాలు పరిచి బూదెమ్మచేత్తో పదిపైసలు ఆ కాగితంమీద వుంచి చిలకను తీయమన్నాడతను.

చిలక బయటికి వచ్చి, అటు యిటు చూసి, చటుక్కున ఓ కాయితం ముక్కుతో తీసి చాచిన అతని చేతిలోవుంచి లోపలికి వెళ్ళిపోయింది. అతను పంజరం తలుపు మూసి, కాగితం మడతలు విప్పాడు.

బూదెమ్మకు మనసులో దిగులుగా వుంది.

అతను ఏం చెప్తాడో?

ఏం చెప్పినా, ఈ సారి....

ఈసారి తప్పకుండా కొడుకు పుడతాడనే చెప్పాలి. నీకు నలుగురాడపిల్లలు తరువాత కొడుకు పుడతాడని చల్లగా చెప్పాలి అని మనసులో దేవుళ్ళకు....కరుణించని, నాలుగుసార్లు కోరుకున్న కోరికను తీర్చని దేవుళ్ళను ఐదోసారి ఆఖరుసారిగా కోరుకుంది బూదెమ్మ.

అతను కాగితం విప్పి చదవటం మొదలుపెట్టాడు.

"అమ్మా....నువ్వు తండ్రిబిడ్డవు. మీ నాయనకు నువ్వంటే ప్రాణంగాని అమ్మకు గాదు. నీ మొగుడు నువ్వు ఊరికే కీచులాడు

కుంటారుగాని .... కలిసివుంటరు. నీకు ఆస్తిలేదు. ఆదాలేదు-నీ సంతానమే నీకు ఆస్తి....అవునా?" అన్నాడు.

అవునన్నట్టుగా తలూపింది బూచెమ్మ.

నారయ్య కూడా తలూపాడు.

"పిల్లలెంతమంది?" ఆత్రంగా అడిగింది బూచెమ్మ.

"తొమ్మిదిమంది!" అంటూ తేల్చిచెప్పాడు.

"కొడుకులు ఎంతమంది?" ఈసారి నారయ్య అడిగాడు.

అతని ప్రశ్నకు బూచెమ్మ ఓ ప్రక్క సిగ్గుపడుతూనే మరో ప్రక్క భయపడిపోయింది.

అతను భ్రుకుటి ముడిచి ఓ క్షణంపాటు చూసి, "నీ రాతల కొడుకుల్లేరు కాని....నువ్వో పరాయిబిడ్డకు ఆసపడ్తవు. పరాయిబిడ్డ నీకు కూడుపెడ్తడు" అన్నాడు.

"అంటె—" నారయ్య అర్థం కానట్టు అడిగాడు.

బూచెమ్మ చేయి సన్నగా వణికిపోసాగింది.

"నీకు కొడుకులు లేరవ్వ—తొమ్మిదిమంది ఆడపిల్లలె" అన్నాడు చావుకబురు చల్లగా చెప్పినట్టు.

బూచెమ్మ మొహం వెలవెలబోయింది.

నారయ్య మొహం ఎర్రవారింది.

నెమ్మదిగా లేచి నిలబడ్డది బూచెమ్మ.

నారయ్య ముందుకు కదిలాడు.

ఓ ఫర్లాంగు వెళ్ళాక, మరో చిలకజోస్యం చెప్పేవ్యక్తి దగ్గిర నారయ్య కూర్చొని చేయి చూపించాడు.

"ఈ జన్మకు నీకు మగసంతతి లేదయ్యా. సంతు సానావుంది గాని అంతా ఆడసంతె...." అంటూ, బూచెమ్మకు కూడా ఆ విధంగా చెప్పడంతో, నారయ్య ఏవగింపుగా చూసాడు బూచెమ్మ దిక్కు.

"థూ" అన్నాడు లేచి నిలబడుతూ.

బూచెమ్మ మొహం వెలవెలాపోయింది.

* * *

ఆ రాత్రి చాలాసేపటి వరకు నారయ్యగాని, బూచెమ్మ కాని

నిద్రపోలేదు. గతం నీలినీడల్లో ఆలోచనల వలయంలో చిక్కుకొని.. నారయ్య ఓ నిర్ణయానికి, బూదెమ్మ మరో నిర్ణయానికి వచ్చారు.

మర్నాడు ఉదయం లేస్తూనే ఊరికి వెళ్దామన్నాడు నారయ్య.

బూదెమ్మ బాలమ్మను పట్టుకుని బావురుమంది.

"మొదనష్టపోడు.... సేసింది సాలక, యిప్పుడు కడుపు తీయించి మందు వోయిస్తడంట. ఈ మాటలు ఎవ్వరంటరో తెలుసా? పెళ్ళాం పిల్లలను ఏలుకోలేని సాతకాని సవటవాడంటడు. మరి నువ్వు మొగోడివి కదా!" అంది బాలమ్మ వెక్కిరించినట్టు.

"ఈ ఒక్కసారికి ఊకో నారయ్య! కడుపులో బిడ్డను సంపడం పాపం! ఒక్కోసారి బెడిసి పెద్దప్రాణం పోతది. ఈ బిడ్డ ఎవరు పుట్టినా, పుట్టినంక మందు పోయించు" అన్నాడు రాజయ్య.

బూదెమ్మ కాళ్ళు పట్టుకొని ఏడ్వడంతో నారయ్య ఒక్కడు ఏం చేయలేకపోయాడు.

"ఆడు జోస్యం సెప్పిందె అంతా నిజం అయితె దానికి మందు వోయించాలన్న మాట నీ నోటి నుండి వచ్చేది కాదు. ఈ ఒక్కసారి దాని నసీబు ఎట్లుంటె అట్ల" అన్నాడు రాజయ్య.

చిలక జోస్యం నిజమే అయిందో లేక, బూదెమ్మ దురదృష్టమోకాని, బూదెమ్మ ఐదోసారికూడా ఆడపిల్లనే కన్నది.

నారయ్య రెండురోజులు యింటికి రాలేదు.

బూదెమ్మ వారంరోజులు ఏడుస్తూ కూర్చుంది.

బాలమ్మ మాత్రం పుట్టిన పసిగుడ్డును మాత్రం తిట్టింది.

ఎవ్వరినీ ఏమీ అనకుండా వున్నది రాజయ్య ఒక్కడే.

'ఆడిదాని సొత్తు తింటె యింతెమరి. మీసమున్న మొగోడు సంపాదించిపెడ్తె....ఆ తిండి బలం వేరె వుంటది. నా ఉసురుపోసుకున్నడు. పదిమందిల నన్ను పలుచన చేయాలని చూసిండు. నా ఉసురు తాకె-వీని కందారు ఆడపిల్లలు పుట్టింద్రు" అంటూ, ఆడపిల్లలు పుట్టడానికి నారయ్య యెన్ని రకాలుగా కారణమో చెప్పింది బాలమ్మ.

ఎవ్వరేమన్నా, నారయ్య మాత్రం ఊరుకోలేదు. భూదెమ్మను

ఊరికి తీసికెళ్ళి మళ్ళీ పిల్లలు లేకుండా మూలికల మందు పోయించాడు.

మనసులో ఆశగా వున్నా, మళ్ళీ ఆడపిల్లలు పుడ్తారేమోనని దిగులుపడి, ఇష్టంలేకున్నా, నారయ్య మాటలు విని, బాలమ్మ తత్వాన్ని తల్లిగానే గాక, సాటి స్త్రీగా అర్థం చేసుకుని మందు తాగేసింది భూదెమ్మ.

ఈ పదకొండేళ్ళలో ఐదుగురాడపిల్లలను ఆస్తిగా సంపాదించుకున్నారే తప్ప, ఉండడానికి ఓ యిల్లు, ఉన్న ఊళ్ళో ఎకరం పొలం సంపాదించుకోలేకపోయారు.

ఆ ఏడాది గడిచేసరికి బాలమ్మ, రాజయ్య ఒకేసారి రిటైరు అయిపోయారు.

"అందరూ ఆడపిల్లలె. నాకేం వుందని, ఏం మిగిలిందని?" అంటూ బావురుమన్న భూదెమ్మను ఓదారుస్తూనే, నారయ్యను నిందించింది బాలమ్మ.

"పిల్లలను కనంగనె అయిపోతదా? ఆల్లకు తిండిబట్టా పెట్టంగనె అయిపోతదా? రేపటికి పిల్లల గతేం కానోనని అనుకున్నాడా? ఆడిదాని సొత్తు తింటున్నడంటె, నేను మొగోన్ని సంపాదిత్తున్నా నన్నడుగద నీ మొగుడు? ఏది సంపాదన....గిదేనా? గవ్వ దాసింగ్రా మిగిలిసినారా? ఆ సంపాదన తిండికి బట్టకెవాయె....మిగిలితే అవ్వనారికి పంపుకున్నడెమొ—ఆ దేవుని కెరిక. యిది యాదుంచుకోబూది....యియ్యాల గాకున్నా, రేపైనా ఈ ఆడదాని సొత్తె నీ మొగనికి కూడు పెట్టెది" అంటూ యిష్టం వచ్చినట్టు నిందించి, తిట్టింది బాలమ్మ.

పెన్షన్ డబ్బు, రాజయ్యది తనది కలిపి, ఉన్న ఊళ్ళోనే యిల్లు, పొలం కొని తన పేరనే రాయించుకుంది బాలమ్మ. తన పేరెందుకు రాయించుకుందో నారయ్యకు అర్థంగాక అడిగాడు.

"నువ్వు సక్కనోడవని నా పేర రాయించుకున్న. నీ పేర రాయిస్తే నీవోల్లను మేపుదామనేనా? నామీద పెత్తనం సెలాయించాలనిగాదూ నీ పన్నగం....ఓరె నారయ్య నా కంతా తెలుసు. నీ

యవ్వారం అంతా నాకు తెలుసు. నేను బతికుండగా నీ చేతిలో చిల్లి గవ్వ పెట్టను. నేను సచ్చినాంకనె" అంది.

"అమ్మ సంపాదన బిడ్డలిద్దరికి వస్తది. ఇప్పుడె నీ పేర ఎందుకు రాస్తది" అంటూ భూషయ్య నసగడంతో, ఈసారి నారయ్య మొండిపట్టుబట్టి పంచాయితి పెట్టించాడు.

ఈసారి నారయ్య అదృష్టం కలిసివచ్చింది.

నారయ్యను ఇల్లరికం తీసుకున్నందుకు అతను అల్లుడే అయినా కొడుకుతో సమానుడని, రేపు బాలమ్మ చచ్చినా, రాజయ్య చచ్చినా కొరివిపెట్టేది నారయ్యే గనుక, వాళ్ళకున్న ఆస్తి మొత్తం నారయ్యకే వస్తుంది గాని, పెళ్ళిచేసుకొని కాపురం చేసుకుంటున్న మల్లమ్మకు రాదని తేల్చి చెప్పడంతో, బాలమ్మ జీవితంలో మొదటి సారిగా ఓడిపోయింది.

కాని ఆమె ఆ ఓటమిని అంగీకరించే స్థితిలో లేదు.

"ఈడికి ఆడపిల్లలె వున్నారు. వీని తర్వాత నా వంశం ఏం కావాలి? అందుకె మల్లమ్మ కొడుకును పెంపకం తీసుకోమనండి భూదెమ్మను" అంటూ అడ్డుపుల్ల వేసింది.

మళ్ళీ కథ మొదటికే వచ్చింది.

ఆస్తిలో సగం ఎలాగూ మల్లమ్మకు దక్కాలనే బాలమ్మ తాపత్రయం యేమిటో యెందుకో, నారయ్యకు, భూదెమ్మకు అర్థం కాలేదు. అక్కడ చేరిన పెద్దలకు అర్థంగాలేదు.

"మగబిడ్డ లేనిది భూదెమ్మ. రేపు ఆడపిల్లల పెండ్లిజేస్తే దానికి దిక్కెవరు? ముసలితనంలో ఎవరు సూస్తరయ్యా! పరాయి బిడ్డను తీసుకుంటె, యియ్యాల గాకుంటె రేపైనా నిజం తెలిసి అంతా చేతుల పట్టుకొనిపోతే దాని గతేం కావాలె? అడుక్కతింటది."

"మల్లవ్వ రెండో కొడుకు అంజయ్యను పెంచుకోమనుండ్రి. ఎంతచెడ్డా అక్కకొడుకు. అన్నం పెడ్తడు." అంది.

"ఆఁ.... పెడ్తడు. ఎవని కొడుకో అల్లకు పెడ్తడుగాని మా కెందుకు పెడ్తడు? ఇప్పటికె సగం కంటె ఎక్కువ సాటుగానైతేనేం

అందించావ్! యిప్పుడు మిగిలింది కూడా బూడిదకెందుకు దక్కాలనే గదా మల్లవ్వ కొడుకును సాదుకోమంటున్నావ్."

"నిజంగా నువ్వు, నీ నీయతు మంచిగుంటే అట్ల జెప్పవ్. మామీద నీకంత పానమే వుంటే మల్లవ్వ కొడుకు నెందుకు.... యే పిల్లగాన్నైనా సాదుకుంటాం ఆడి పేరనె రాయి" అన్నాడు నారయ్య.

అక్కడ గూడిన పెద్దలందరూ నారయ్య మాటను బల పరిచారు.

"అవును పెంపకానికి యెవరినైనా కుర్రాణ్ణి తీసుకుంటే చాలుగాని, మల్లమ్మ కొడుకునే తీసుకోవాలని ఎక్కడుంది?"

ఈ ప్రశ్నకు జవాబు ఏమిటో బాలమ్మకు తెలీలేదుగాని, నారయ్య అలా అడగడానికి కారణం, ఏమిటో అతని అభిప్రాయం ఏమిటో అర్థమైంది బాలమ్మకు.

నారయ్య పెద్దచెల్లెలికొడుకు. పన్నెండేళ్ళ వాడున్నాడు. నారయ్య పెద్దకూతురు అనసూయకు పదేళ్ళు. చెల్లెలితో సంబంధం కలుపుకోవాలని నారయ్యకు చాలారోజులుగా వుంది. మాటవరుసకు భూదెమ్మతో అన్నాడు నారయ్య.

ఈ విషయంలో, బాలమ్మ తన అంగీకారాన్ని తెలుపలేదు. పైగా, "గతిమాలిన సంబంధం....నీతి రీతి లేని సంబంధం" అంటూ, నారయ్య తాతముత్తాతల దగ్గరినుండి నారయ్యవరకు తిట్టి పోసింది.

బాలమ్మ ఎంత తిట్టినా తన మనసులో గట్టిగా నిర్ణయించు కున్న నారయ్య ఆమె మాటలను ఖాతరు చేయలేదు. భూదెమ్మతో కూడా తన నిశ్చయాన్ని చెప్పేసాడు. భూదెమ్మకూడా తన అంగీకారాన్ని పరోక్షంగా తెలిపినా, బాలమ్మ ముందు ఈ విషయం ప్రస్తావించలేదు.

ఇప్పుడు పెంపకం విషయం వచ్చేసరికి, చెల్లెలి కొడుకును, అనసూయకు పెళ్ళిచేసి, ఇల్లరికం తెచ్చుకోవాలని నారయ్య వేసిన పథకం బాలమ్మ పసికట్టింది.

అందుకే పదిమందిలో నిలదీసి చెప్పింది.

"మల్లవ్వ కొడుకును కాదని, పరాయి యింటి బిడ్డను తీస్కుంటానని అంటున్నావ్. అట్లనేకాని....కాని మల్ల నీ అవ్వగారి తరపు వాళ్ళను మాత్రం తీసుకుంటే నేనొప్ప. నీ పెల్లాం అవ్వగారు పనికిరారుగాని, నీ అవ్వగారు పనికివస్తారా?" అంటూ అనేపింది.

ఈ దెబ్బతో నారయ్య పథకం తారుమారైంది.

"నేను నా సెల్లెలి కొడుకును, అనసూయకు జేస్కుంట. పెంపకం వద్దుగాని, వాణ్ని ఇరిటం తెచ్చుకుంట. ఆడిపేరనే రాసియ్యి" అన్నాడు చివరికి.

"ఊఁ....అది పంగతి. నాకు తెల్వదనుకున్నావ్. ఆడు నీకు కూడు వెడ్తడని, బూదెమ్మను అవ్వ లెక్క సాదుకుంటడా?"

"ఎందుకు సాదుకోడూ?"

"ఎందుకంటే—ఆడు నీ సెల్లల కొడుకు."

"అయితే?"

"నిన్ను యిరిటం తీసుకుంటే యియ్యాల మాకేం బెడ్తున్నవ్. కూడు వెట్టకపోయినా, పదిమందిల పంచాయితి వెడ్తున్నవ్. నన్ను బదనాము జేస్తున్నవ్. పదిమందిలా నన్ను పలుచనజేస్తున్నవ్. నిన్ను జేసుకునే మాలావు సుఖపడ్తుంది బూది. ఇంక దానిబట్టి ఏ సెల్లెలి కొడుకును సేసుకొని సుఖపడ్తదా? నీ సెల్లెలి కొడుకు, నువ్వు నన్నెంత బాగా సూసినవో దాన్ని అట్లనే జూస్తడు" అంది.

ఈసారి బాలమ్మ మాటలను బలపరిచారు పెద్దలు.

నారయ్య అనసూయను, చెల్లెలి కొడుక్కు యిచ్చి పెళ్ళి జరిపించితే జరిపించనీ కాని, ఆస్తిమాత్రం రాదు పెంపకానికంటూ ఇష్టే పరాయి కుర్రాణ్ని తీసుకోవాలి.

ఈ నిర్ణయం విని, పదిహేను రోజుల్లో ఏ విషయం తెలిపితే. పొలం, ఇల్లు బాలమ్మ పేరుమీదనో, లేక, నారయ్య పెంపకానికి తీసుకునే కుర్రాడి పేరనో రాయడం జరుగుతుందని చెప్పారు.

తనకు అనుకూలంగా చెప్పడంతో ఆనాటి కల్లుకుండ ఖర్చు బాలమ్మ భరించింది.

వారం రోజులు గడిచిపోయాయి.

చుట్టుప్రక్కల ఉన్న ఊళ్ళల్లో వాకబుచేశాడు నారయ్య. ఎవ్వరూ ముందుకు రాలేదు. ఎవరైనా రావాలనుకున్నా, బాలమ్మ గురించి వినగానే వెనక్కి వెళ్ళిపోయారు.

పది రోజులు గడిచిపోయాయి.

ఆ రోజు—ప్రక్క ఊరికివెళ్ళి కాదనిపించుకుని యింటికి వచ్చాడు నారయ్య.

ఈ గొడవ వచ్చినప్పటినుండి అందరూ ఊళ్ళోనే వున్నారు. ఉద్యోగానికి పెట్టుకున్న సెలవు అయిపోయింది. ఆ మరునాడే చేరిపోవాలి.

అతనికి దిగులుగా అన్పించింది.

బాలమ్మ ఒక ఆడదానిలా, సామాన్య స్త్రీలా కన్పించడం మానేసింది ఈ పది రోజులుగా.

ఆమె ముందు ఓటమి ఒప్పుకోవడమే చివరికి జరుగుతుంది. ఆమె ఎలాంటిదో తెలిసి తెలిసి ఎవ్వరూ కుర్రాణ్ని ఇవ్వడంలేదు. ఎవరైనా ముందుకు వచ్చినా, వాళ్ళు బాలమ్మ విషయం విని వెనక్కి వెళ్ళిపోతున్నారు.

"మేం బీదోల్లం. పిలగాణ్ని సదివించలేం. సాకలేం. ఏదో మీకిస్తే కూడు అయినా సరిగ్గా తిని, సల్లగుంటడు అని అనుకుందా మంటే, మీ యవ్వ సల్లగుండనిచ్చెలా లేదు. పెద్దబిడ్డ కొడుకున్ని కాదని, మా పోరన్ని సాకుకుంటే, రేపు కసికొద్ది మాపోరన్ని సంపిచ్చేసినా సంపించేత్తది. వద్దు నాయనా....మీరూ వద్దు. మీ కూడు వద్దూ మీ పెంపకం వద్దూ" అంటూ మొహంమీదే అని వెళ్ళి పోతున్నారు.

నారయ్య విసిగిపోయాడు.

సిట్టసివరికి గెలుపు అత్తదే అనుకున్నాడు.

అందుకే భూదెమ్మతో చెప్పాడు.

"ఇంకా నాల్రోజులుంది. ఈ పది రోజుల్లో పైసల కాని యవ్వారం ఈ నాల్రోజుల్లో అయితదన్న నమ్మకం నాకులేదు. నేను

అనాదే సెప్పిన. నీ అవ్వ సంపాదించి కూడ వెట్టేదంతా నీ అక్కకే వోతది, మనకుగాదె అంటె యిన్నవ్‌గాదు. వద్దు వద్దంటుంటే ఐదుగురాడపిల్లలను కన్నావ్. మీ అవ్వ సంగతి తెలిసి ఎవ్వరు పొరగాన్ని యిస్తలేరు. యిగ యియ్యరుగూడ. ఈ నాల్రోజులైనంగా ఏం పైసల అయితదో యిని నువ్వు రా....రేపు పొద్దపేల బండికి నేను వోత అన్నాడు'' భూదెమ్మ తలూపింది.

నారయ్య మాటల్లో నిరాశ. మనస్సులో నిస్పృహ.

భవిష్యత్తుగురించి అతని ఆలోచన విన్న రాజయ్య మనసు చలించిపోయింది.

నారయ్య వెళ్ళిపోయాడు.

బాలమ్మ గర్వంగా నవ్వుకుంది.

ఆమె నవ్వులో గర్వమేకాదు, మరోభావం కదిలింది. అది ఒక్క రాజయ్యకే అర్థమైంది.

"అవ్వసూడు నాయనా ఎట్ల నవ్వుతుందో? నేనేం పాపం జేసిన్నో ఏమో, సిన్నప్పటినుండి అంతే, నేనంటే కోపమే. ఏనాడు మంచిగ జూసిందని? అక్కమీదనే ఆమెకు పానం. అయితే అయిం దని ఊకున్న, నా పిల్లలకు పెట్టకపోయినా, అక్కకు వెట్టినా అదేం దని అడిగిన్నా? అందరు ఆడిముండలు పుట్టింద్రన్న కనికరం కూడా లేదు. కొడుకులను గన్నతల్లి యింకా అక్కమీదనే పానం అవ్వకు. నేను నా పిల్లలు అన్నయం అయిపోయినం'' అంటూ రాజయ్యను పట్టుకొని బావురుమంది.

"నువ్వన్న అవ్వకు జెప్పె నాయనా?" అంది ఏడుస్తూ. రాజయ్య మాట్లాడలేదు.

"గుడ్డిముండా కొడుకు. ఆదేంది నాకు జెప్పేది? నేను యినేది?" అంది బాలమ్మ.

రాజయ్య మాట్లాడలేదు మౌనంగా తల పంకించాడు.

ఎందుకోగాని, చాలా రోజుల తరువాత, కొన్నేళ్ళ తరువాత అతడూ ఆలోచించాడు.

ఓ నిర్ణయానికి వచ్చాడు.

"బాలితో నేను పందెం ఏస్తాను."

ఈసారి....నా బిడ్డను కాపాడుకుంటాను. మల్లవ్వ నా బిడ్డ కాకపోయినా, నా బిడ్డనుకొని, ఎప్పుడూ ఏది యియ్యకని అడ్డు సెప్పలేదు. నేను ఊకున్నందుకు మరింతగా సెలరేగిపోతుంది బాలి. ఈ ఇసయంలో నేను కలగజేసుకోకపోతే, భూదెమ్మ గతి అధ్వాన్నం అయితది. నాకెరికె. తల్లి ఆస్తి బిడ్డలిద్దరికిని, సగానికిపైగా మల్లవ్వకు ముందుగానే యిచ్చి, మిగిలిన సగంలో, తిరిగి అందరి ముందు భాగం పంచుతది.

మల్లవ్వ అంటే బాలికి ఎందుకంత పానం? అందంగా వుంటదనా? లేక నర్సిమ్మకు పుట్టిందనా?

అంటే—

నర్సిమ్మ అంటే బాలికి యిట్టం కావొచ్చు.

అట్లని మల్లవ్వ అన్నా యిట్టం కావొచ్చు.

కాని....భూదెమ్మ తన బిడ్డ. తనకు పుట్టిన బిడ్డ....

నల్లగా వున్నా....తనకు పుట్టినా, కన్నది బాలమ్మే.

మల్లవ్వలాగానే తొమ్మిది నెలలు మోసికన్నది.

మరి....

పిల్లలు ఎలాగున్నా, కన్నతల్లికి సమానులే. రంగుల భేదంలో అనురాగాల విలువలు, అనుబంధాలు మారుతాయా? తల్లి ప్రేమ కేవలం రంగులకే పరిమితమా? అందానికే అంకితమా?

కాదు. కాకూడదు.

మరి జరుగుతున్నదేమిటి? జరగబోయేదేమిటి?

బాలమ్మ ఎందుకలా ప్రవర్తిస్తోంది?

భూదెమ్మమీద బాలమ్మకు గల నిర్లక్ష్యానికి కారణం ఏమిటి?

భూదెమ్మ నల్లగావుండడమా?—లేక తనకూతురుకావడమా?

బూదెమ్మ అన్నట్టు బాలమ్మ ఏనాడు బూదెమ్మను ఆదరించలేదు. తల్లిలా ప్రేమించలేదు. అభిమానించలేదు.

మల్లమ్మ తినగా మిగిలినది పెట్టింది.

మల్లమ్మకు వేసిన బట్టలు, పాతవడిపోయి సగం మాసిపోయిన

తరువాత బూదెమ్మకు యిచ్చింది.

పొరపాటున కొత్తవి కుట్టించినా, ఏదో చౌకరకం బట్టలే కుట్టించింది.

అదేం అని తాను అడిగేలోగానే బూదెమ్మ పేచీపెట్టేది. దాంతో బాలమ్మ రెచ్చిపోయి. 'నీ మొఖానికి అదొక్కటే తక్కువ.... అద్దంలో సూసుకో కర్రిమొకాన్ని___'

అంటూ ఈసడించి, విదిలించె బాలమ్మ, గుక్కపెట్టి ఏడ్చినా, వెక్కిళ్ళుపడ్డా బూదెమ్మను ఒక్కసారి

ఒక్కసారి గుండెలకు హత్తుకొని ఓదార్చలేదు అమ్మగా లాలించలేదు.

పాతికేళ్ళ భూదెమ్మ జీవితంలో ఏనాడు తల్లి తన కన్నీళ్ళు తుడిచి, నాలుగు ఓదార్పు మాటలు మాట్లాడలేదు.

ఎందుకు? కారణం ఏమిటి?

బూదెమ్మ చేసిన పాపం ఏమిటి?

తనకు పుట్టడం పాపమా?

లేక తనలా నల్లగా వుండడం నేరమా?

లేక.... -

జీవితంలో ఏ ఒక్కనాడు కూడా బాలమ్మ భర్తగా తనకు ఒక్కసారి అభిమానించినా, ఒకసారి కాకపోయినా ఒకసారి బూదిని కూతురుగా ఆదరించేది?

మరి ఆదరించడం లేదంటే కారణం....

రాజయ్య యిక ఆలోచించలేకపోయాడు.

అతనిలో ఏదో అనుమానం ఏదో సడలని పట్టుదల.

బాలిని ఓడించాలి....భూదెమ్మకు బాలి తల్లిగా మసలక పోయినా, అమ్మలా మిగలకపోయినా తాను మాత్రం బూదికి తండ్రిగా మిగలాలి. నిలవాలి.

రాజయ్య ఓ నిర్ణయానికి వచ్చాడు.

తన నిర్ణయాన్ని ఎవరికి చెప్పలేదు. ఆ రాత్రి అతను పట్నం వెళ్ళిపోయాడు.

పదిహేను రోజులు గడిచిపోయాయి.

మరో గంటకల్లా పంచాయితి జరుగుతుంది.

ఊరి కరణం కూడా వచ్చాడు.

మల్లమ్మ, భూషయ్య, పిల్లలతోసహా చేరుకున్నారు. బాలమ్మ, బూదెమ్మ పిల్లలను తీసుకొని వెళ్ళారు.

పెద్దలందరూ వచ్చారు.

"రాజయ్య ఏడి?" కరణం అడిగాడు.

"రాజయ్య లేడు. ఊరికిబోయిండు. ఆడితో ఏంపని?" అంది బాలమ్మ సంపాదన తనది కాబట్టి అధికారం తనకే వుంటుందని.

"సంపాదన నీదె అయినా రాజయ్య నీ మొగుడు. ఆయన సంతకం కావాలి" అన్నాడు కరణం.

"ముందుగాల పంచాయితి తెగనీ దొర....ఆడు ఎనక వచ్చి దస్కతు బెడ్తడు."

"కాదని అంటె—"

"ఆడిమొహం. కాదని ఆడేంది అనేది?"

బాలమ్మ మాటల్లో కదిలిన అహంకారం, అభిజాత్యం చూసి కరణం విస్తుపోయాడు. బూదెమ్మ మాటిమాటికి కన్నీళ్ళు తుడుచుకుంటుంటె మల్లమ్మ చిరునవ్వులు చిందిస్తోంది.

"నారయ్య ఏడి?"

"ఊరెల్లిపోయిండయ్యా....ఏముందని వుంటడు? అయ్యకూడా వోయిండు" అంది బూదెమ్మ దిగులుగా.

"నారిగానికి మొఖం వున్నది?" అంది బాలమ్మ సవాలు చేస్తున్నట్టుగా.

"సరె మరి" అన్నాడు కరణం.

ఇంతలో—రాజయ్య వచ్చాడు.

దూరం నుండి అతణ్ణి చూస్తూనె ఎందుకో బాలమ్మ కుడికన్ను అదిరింది. ఏ మూలనో తొలిసారిగా భయం, బెరుకులాంటివి కలిగాయి.

అతను—రాజయ్య.

నల్లగావున్నాడు. ఒంటికన్ను రాక్షసుడిలా, ఒక కన్ను గాజు

కన్నుతో భయంకరంగా కన్పిస్తున్నాడు.

మొహంనిండా మశూచికపు మచ్చలు—

అసహ్యంగా వున్నాయి—

సీరుకావి ధోవతి....మాసి నల్లగావున్న చొక్కా, రేగిపోయి, మాసిపోయిన జుట్టు....

అతని మొహంలో....ఉన్న ఒక్క కంటిలో

ఎంతో శాంతం, నడకలో ఎంతో ఠీవి

'అయ్యా!' అంటూ బావురుమంది భూదెమ్మ.

"ఏడ్వకు నారయ్య గూడా వచ్చిండు" అన్నాడు.

రాజయ్య వెనుకగా నారయ్య వచ్చాడు.

అతని వెంట....ఐదేళ్ళ కుర్రాడు.

అమాయకంగా నోట్లో కుడిచేతి బొటనవేలు పెట్టుకొని చీకుతూ మెల్లిగా నడుస్తూ వస్తున్నాడు.

"ఎవరీ పోరడు?"

ఒకే ప్రశ్న బాలమ్మ గుండెల్లో, భయంకరంగాను, భూషయ్య, మల్లమ్మ మనసులో వికృతంగాను, బూదెమ్మ చూపుల్లో ఆనందంగాను కదిలింది.

రాజయ్య ఒక్కసారి బాలమ్మ వంక చూచి, జేబులో నుండి ఒక కాగితం తీసి, కరణం దగ్గరికి వెళ్ళి, ఆ కాగితాన్ని చూపెట్టి. నారయ్య చేయి పట్టుకొని నిలబడ్డ కుర్రాణ్ణి దగ్గరికి తీసికెళ్ళి నిలబెట్టాడు.

"ఈ పిలగాడేనా కరణం ప్రశ్నించాడు, కాగితం చదివి.

"ఊఁ...."

"బాలమ్మా...." అంటూ అసలు విషయం చెప్పాడు కరణం.

ఆ కుర్రాడిపేరు ఎంకటి. తల్లిపేరు కనకమ్మ. తండ్రిపేరు సెలమయ్య. తండ్రి లారీ యాక్సిడెంటులో పోతే కనకమ్మ పిచ్చిదై పోయింది. ఆ కనకమ్మ కొడుకె ఈ ఎంకటి. ఎంకటికి పిచ్చితల్లితో పాటు ముసలితాతయ్య సివయ్య వున్నాడు.

ఈమధ్యనె కనకమ్మను పిచ్చాసుపత్రిలో వేస్తె పారిపోయింది.

ప్రస్తుతానికి ఎంకిటికి ఉన్న పెద్దదిక్కు సివయ్య. సివయ్య లాయరు ముందు, నోటుకాగితం మీద ఆ కుర్రాణ్ణి, నారయ్యకు పెంపకానికి యిచ్చినట్టు రాపిచ్చిన కాగితం అది.

చట్టప్రకారం, ఎంకటి నారయ్యకొడుకైపోయాడు.

అందుకు సాక్ష్యంగా ఆ కాగితంతోపాటు, సివయ్య కూడా వచ్చి చెప్పడంతో, కరణం ఆమోదించి, బాలమ్మ విధించిన ప్రకారం ఆస్తి....

బాలమ్మ కుప్పకూలిపోయింది.

పంచాయితి ముగిసింది.

పంచాయితి జరిపిన పెద్దలకు ఓ కల్లుకుండా, ఓ మేక సమర్పించి, నారయ్య బూదెమ్మ పిల్లలను తీసుకొని, ఆ పూటనే పట్నం వెళ్ళిపోయారు.

భూషయ్య, మల్లమ్మ తమకు పరోక్షంగా జరిగిన అవమానానికి మొహాలు మాడ్చుకొని, ఆ పూటె వాళ్ళవూరు బాలమ్మను వొదిలేసి వెళ్ళిపోయారు.

ఆ ఊళ్ళో—చీకటి పడుతున్న వేళ.

ఆ యింట్లో ఇద్దరూ మిగిలిపోయారు.

రాజయ్య—బాలమ్మ.

రాజయ్య అరుగుబైట కూర్చొని, బీడీ కాలుస్తూ ఆలోచన్లో పడిపోయాడు.

ఇప్పుడతని మనస్సు ప్రశాంతంగా, ఏ దిగులులేకుండా వున్నది.

తన బిడ్డకు తాను అన్యాయం చేయలేదన్న తృప్తివుంది.

యిన్నాళ్ళకైనా బాలమ్మను ఓడించగలిగాననే ఆనందంవుంది.

కాని అది ఎంతసేపో కాదు.

ఎక్కడివాళ్ళు అక్కడికి వెళ్ళిపోయాకా బాలమ్మ—

రెక్కలు విరిగిన పక్షిలా.

లోకంలో గల ఒంటరితనాన్నంతా కూడగట్టుకున్నట్టుగా ఒక్కతె—

గదిలో నులకమంచంమీద పడుకొని ఆలోచిస్తోంది.

గతం తాలూకు స్మృతులు ఆమెకు ఒక్కొక్కటి గుర్తుకు వచ్చి కలవరపెట్టసాగాయి.

మొదటిసారిగా ఓడిపోయిన ఆమెకు అంత వరకు ఏమూలో దాగిన మనసాక్షి వెలికివచ్చి అడిగే ప్రశ్నలకు జవాబులు చెబుతూ వుండిపోయింది.

బూదెమ్మ మల్లమ్మలాగె తనకు కూతురు.

నారయ్య భూషయ్యలాగె తనకు అల్లుడు.

కాని....నారయ్య తనకు కొడుకులాంటివాడు. కన్న తల్లి తండ్రిని వొదలి తన వంశానికి వచ్చినవాడు.

ఏనాడు తనవాళ్ళకి పెట్టమని అడగలేదు. తనకోసం పెట్టమని అడగలేదు. బులిపించి తీసుకోలేదు. అతని జీతం అంతా తెచ్చి తన కిస్తే—తనేమంది?

"నీ సంపాదన, నీ బిడ్డలకు, పెళ్లానికి తిండికే సరిపోతుందని" విసుక్కుంది తిట్టింది.

కాదన్లేదు.

ఈనాడుకూడా తనకివ్వమని అడుగలేదు. తనే ఇవ్వనంది. ఎందుకు? మల్లమ్మకు సగం పోవాలని.

బూదెమ్మ తన కూతురుకాదూ?

తనకూతురే. తన మెళ్ళో మూడుముళ్ళు వేసి, యిన్నేళ్ళుగా తనతో వుంటూ, నీడలా, విడిచివెళ్ళని రాజయ్యకు పుట్టిన బిడ్డ.

అందుకే తనకు ఇష్టంలేదు.

బూదెమ్మ నల్లగా వుందనికాదు తనకోపం.

కాని—బూది రాజయ్యకు పుట్టింది.

రాజయ్య—ఒంటికన్ను రాక్షసుడు. దీనికంతా కారణం రాజయ్యే. రాజయ్యమీది అసహ్యం, జుగుప్స, అయిష్టం బూదెమ్మను బాధించేలా చేసాయి.

కాని....దానికి బాధ్యురాలు బూదెమ్మె ఎందుకైంది? జవాబుగా రాజయ్య గదిలో కొచ్చాడు.

"బాలీ!"

రాజయ్య పిలుపుకు తలతిప్పి చూసింది బాలమ్మ.

"గట్లున్నవేంది?"

"ఏం లేదు."

"ఒక్కమాట చెబుతా బాలి!"

ఏమిటన్నట్టుగా చూసింది.

"నేనంటె నీకిట్టం లేదని నాకు తెలుసు. యిప్పుడే కాదు, మల్లవ్వ పుట్టకముందె తెలుసు. తెలిసికూడా నిన్నేం అన్లేదు. ఎందుకంటావ్? ఇట్టంలేకున్న, నువ్వు నన్ను నీ మొగనిగ అందరికి చెప్పుకున్నావ్. యిన్నేండ్లు కాపురం జేసినవ్. ఇట్టంలేని మొగనితో యిన్నేండ్లు కాపురం సెయ్యడం సానా కట్టం బాలీ....అయినా నువ్వు జేసినవ్....నీకెంత ఓపికానె" అంటూ మెచ్చుకోలుగా చూసాడు.

అతని ఒక్కమాట ఒక్క సమ్మెట పోటులా బాలమ్మ గుండెలమీద తాకుతుంటె, పచ్చినిజాన్ని పదిలంగా నిశ్చింతగా, నిర్లిప్తంగా, నిర్వికారంగా తనతో చెప్తూవుంటే, బిత్తరపోయి వింటూ, లోలోపలే సగం చచ్చిపోతూ, సిగ్గుతో చితికిపోతూ, ధైర్యంగా రాజయ్య మొహంలోకి చూడలేక కూర్చుండిపోయింది బాలమ్మ.

అతను మళ్ళీ చెప్పడం మొదలుపెట్టాడు.

"మల్లమ్మను బూదెమ్మను ఒక్క కడుపులనే మోసి కన్నావ్. అల్లు ఎవరెవరికి పుట్టినా కన్నదానివి, కన్నతల్లివి నువ్వే. నర్సమ్మ అంటే నీకున్న యిట్టంప్రేమ. మల్లమ్మమీన సూపిచ్చినవ్. నామీద నీకుండె కోపం, అయిట్టం, బూదిమీద సూపిచ్చినవ్. కాని ఒక్క ఇసయం మర్చినావె—"

"తల్లివి నువ్వు—నీ యిద్దరు బిడ్డలు నీకె నీ కడుపు పించుకునె పుట్టిండ్రు. నీ రెండు కండ్లలో ఒకటి మంచిగా మరొకదాన్ని సెడ్డగా సూడ్డం నాయంగా వుంటుందా? అట్టా జూస్తె బాధపడేది నీ కన్నె....నీ కన్న కడుపె. కాదంటావా?"

అతని ప్రశ్నకు ఉలిక్కిపడుతూ చూసింది.

అతనికంతా తెలుసు. అతనికి నిజం తెలుసు.

నిజంలో దాగిన తను నర్సిమ్మ తెలుసు.

తను, నర్సిమ్మ కలిస్తే పుట్టిన మల్లిమ్మ తెలుసు.

అయినా ఏనాడు తననేం అన్లేదు.

వొదిలి పెట్టలేదు. నిజం పదిమందిలో చెప్పలేదు.

మల్లిమ్మను ప్రేమించకున్న ద్వేషించలేదు. చీదరించుకోలేదు. విసిరికొట్టలేదు.

"ఎందుకు?"

"నేను మనిసిని బాలి." అన్నాడు రాజయ్య.

తన నోటినుండి వెలువడని ప్రశ్నకు రాజయ్య సమాధానం ఇవ్వడంతో ఉలికిపాటుగా చూసింది.

"అంతేకాదు కన్న తండ్రిని. బూది అంటె నాకు పానం. అది అన్నేయం అయితె నాకు బుగులుగా వుంటది బాలి.

"అవ్వా అని అది ఏడ్చి మొత్తుకున్నా కరగలేదు నీ మనసు. అదె మల్లవ్వ అడక్కపోయినా యిచ్చినవ్. ఆనాడు నేనేం అన్లేదు.

"నాకు తెలుసు. నా ఒక్కడి సంపాదనె మన అందరి తిండికి పోతే నారయ్యది నీది దాస్తున్నవని.

"తెలిసినా నినేం అన్లేదు. ఎందుకని....ఎప్పటికైనా నిజంగా నువ్వు బూదిని అన్నయం సెయ్యవని.

"కాని...."

పంచాయితిలో నువ్వు చెప్పిన ఇసయం యిన్నంక నా మన సాగలేదు బాలి."

"అందుకె నేనె పట్నంబోయి సివయ్యను ఒప్పించి ఎంకటిని నారయ్యకు పెంపకానికి యిప్పించిన."

"నామీద నీకు కోపంగా వుంటుందని నాకు తెల్సు బాలి. కాని నాది కన్నకడుపు....నేను బూదికి కన్నతండ్రిని. దాని ఖర్మం గాకపోతే ఏంది? అందరూ ఆడపిల్లలె పుట్టింర్రు."

రాజయ్య మాటలు పూర్తికాలేదు.

బాలమ్మ ఫక్కున నవ్వింది.

అలా నవ్వడం చాలా యేళ్ళ తరవాత చూసాడు రాజయ్య.

"ఏందె గట్ల నవ్వుతవ్?"

"ఏం లేదయ్య. నువ్వెంత పిచ్చోడివో........అంత మంచోడివి ..."

"ఎంకటి అంటె నీ కిట్టమేనా బాలీ...."

రాజయ్య ప్రశ్నకు వెర్రిగా చూసింది.

ఆమె కళ్ళల్లో ఏదో భావం....

"పోరడు మంచోడు బాలి...."

"నీలాగా...." అంది బాలమ్మ.

"నేనంత మంచోణ్ణి కాదు బాలి....నే నొట్టి సేతగానోణ్ణి" అన్నాడు. అతని మాటలకు పరీక్షగా అతని మొహంలోకి చూస్తూ "ఒక్కమాట ఇంటావా?" అంది.

రాజయ్య ఆమెవంక చూసాడు.

"ఎంకటి అంటె నాకిట్టం అయినా కాకపోయినా ఆడిప్పుడు బూది కొడుకు. నారయ్య అంటె నా కిట్టంలేదు. అందుకే నేను జస్తే ఎంకటిచేత కొరివిబెట్టించు" అంది.

బిత్తరపోయాడు రాజయ్య.

"పంచాయితిలో చెప్పింండ్రుగదయ్య....ఎంకటి నా మనవడు. మన వంశం ఉద్ధరించుతడని కరణందొర జెప్పలె."

"ఊఁ...."

"మరి మాటియ్యి" అంది.

రాజయ్య మాటిచ్చాడు. చీకటి నిండిన ఆ గదిలో బాలమ్మ మొహంలో కదిలే భావం ఒంటికన్ను రాజయ్య గమనించలేదు.

"నేనిగ పండుకుంటనయ్య" అంది ఓడిపోయి అలిసిపోయిన బాలమ్మ.

ఆమె ఓటమిని చూసిన రాజయ్య ఆమె ఓడిపోయిందనే అనుకున్నాడు కాని, జీవితంలో పూర్తిగా అలిసిపోయిందని అనుకోలేదు.



# ముల్లు

## (పెద్ద కథ)




ఆర్. ఇందిర

"ఆ... నోరు తెరమ్మా...."

"ఆఫ్ హ్యూమన్ బాండేజ్"లోంచి తలెత్తి పైకి చూశాను. నా నోట్లో చాక్లెట్ పెట్టి, నవ్వుతూ చేతులు వెనక్కి కట్టుకుని వంగి నిల్చునివున్న మురళి కనిపించాడు. ఒక కన్ను కప్పేసి మొహంమీద పడ్డ వుంగరాల జుట్టూ, పసిగా-స్వచ్ఛంగా మొహం, తెల్లకోటూ, అందులోంచి తొంగిచూస్తున్న స్టెత్....రోజూ చూస్తున్నా నాకెందుకో మురళీ ప్రతీసారీ కొత్తగానే కనిపిస్తాడు.

"ఏంటీ మురళీ. ఇంత లేట్‌గా వచ్చావేం? ఏదైనా ఇంట్రస్టింగ్ కేస్ వచ్చిందా?" అన్నాను నవ్వుతూ.

"అమ్మా....అమ్మా....అమ్మా...." కూచుని నా ఒళ్లో తల పెట్టి కదిలిస్తూ "నీకెలా చెప్పాలమ్మా? టుడే ఐయామ్ ఎక్స్ట్రీమ్లీ హేపీ" అన్నాడు.

సాధారణంగా మురళి చిన్న విషయాలకి అంత కదిలిపోడు. ఒక్క నిమిషం....అదేమయ్యుంటుందా అని ఆలోచించాను.

"ఊఁ....ఫస్ట్ కేస్ సక్సెస్ అయింది కదూ? నువ్వొక్కడివే.... నీకు నువ్వే డయాగ్నైస్ చేసి, మెడిసిన్ ఇన్‌టైమ్‌లో ఇచ్చి ఒక పేషంటుని బతికించావ్. ఔనా?" అన్నాను నవ్వుతూ.

చటుక్కున తలపైకెత్తాడు. "నీకెలా తెలిసిందమ్మా? ఎగ్జాక్ట్లీ అంతే....చూసినట్టు చెప్పేశావు!" ఆశ్చర్యంగా కళ్లు పెద్దవి చేసుకుని నా వంక చూశాడు.

"డాక్టర్‌గా ఇరవైయ్యేళ్ళ ఎక్స్‌పీరియన్స్ తర్వాత 'ఎక్స్ట్రీమ్ హేపీనెస్' డాక్టర్‌కి ఎప్పుడొస్తుందో అంత మాత్రం వూహించలేనా. సరే నా సంగతి వదిలెయ్. అసలేం జరిగింది?"

మురళి నా కాళ్ళదగ్గిర కూచున్నాడు.

"నైట్‌డ్యూటీ అయిపోయిందా అమ్మా. నేనూ, గోపీనాథ్ వచ్చేస్తున్నాము. గోపీనాథ్ ఏవో వాళ్ళ ఫామిలీ సంగతులు సీరియస్‌గా చెప్తూంటే వింటూ ఔట్‌పేషంట్‌వార్డ్ బైటి వరండాలో నించున్నాను. మాటల్లో పడి మాకు టైమ్ తెలీలేదు. టైమ్ చూసుకుంటే ఏడు దాటింది. గోపీనాథ్ మాటలు వింటున్నా నాకు తెలీ

కుండా ఎవరిదో మూలుగు వింటూ వున్నాను చాలా సేపట్నించి. ఇద్దరం వరండా మెట్లు దిగబోతూంటే బెంచీమీద ఒక పల్లెటూరి అమ్మాయి, ఒళ్ళో బిడ్డని పడుకోబెట్టుకొని కూచుని వుంది. మూలగటం ఆ పసివాడే!

'ఇంత పొద్దున్నే వచ్చిందేం? ఎనిమిదిన్నరకి కాని ఔట్ పేషంట్స్‌ని చూడరు. పాపం తెలీక వచ్చిందేమో' అనుకుని "ఆ కేసేమిటో చూద్దామా?" అన్నాను గోపీనాథ్‌తో.

"ఒద్దు, ఇప్పటికే లేటయింది. వెళ్దాం రా" అన్నాడు.

గేటు దాకా నడిచాము. బిడ్డ మూలుగు నాతోనే వస్తూన్నట్టు తోచింది. "గోపీ నువ్వెళ్ళు. నాక్కొంచెం పనుంది" అని చెప్పి గబ గబా వెనక్కి వచ్చేశాను.

ఆమెని వార్డ్‌బాయ్ వెళ్ళగొట్టేస్తున్నాడు. ఆమెని వుండమని చెప్పి, బిడ్డని బల్లమీద పడుకోబెట్టి ఎగ్జామిన్ చేశాను. బిడ్డ మొహం ఎర్రగా వుబ్బివుంది! బరువుగా శ్వాస పీలుస్తున్నాడు. నాకేదో అనుమానం వేసింది.

"ఎన్ని రోజుల్నించి జ్వరం వస్తోందమ్మా....?" అని అడిగాను.

"మూడురోజుల్ని వుందని" చెప్పింది.

బిడ్డని ఎత్తుకుని రమ్మని ఎమర్జన్సీవార్డులో టేబిల్‌మీద పడుకోబెట్టాను. నర్సుని టెంపరేచర్ నోట్ చెయ్యమన్నాను. నే ననుకున్నట్టే అరగంటలో నిమిషాల్లో టెంపరేచర్ స్టీప్‌రైజ్— లోఫాల్.... టెంపరేచర్ మినిట్స్‌లో ఛేంజ్ అవుతోంది. గాడ్. సరైన సమయానికి బిడ్డని చూశాను. హిజ్ లైఫ్ ఈజ్ ఇన్ మినిట్స్....ఎవరైనా సీనియర్ డాక్టర్ని కన్‌సల్ట్ చేద్దామంటే ఆ సమయంలో నాకు ఎవ్వెరి మినిట్ ప్రెషియస్‌గా వుండింది. ఈలోపల బిడ్డ ప్రాణం పోతే. అమ్మా నీకూ అయ్యిందొచ్చు ఎన్నోసార్లు ఇలాంటి ఎక్స్‌పీరియన్స్. అందుకే అదేమిటో నేను చెప్పలేకున్నా నువ్వు అర్థం చేసుకోగలవు.

నాకా క్షణంలో నేను కాదనిపించింది. ఎవరో లీడ్ చేస్తు

న్నట్టు....నీ మాటల్లో అఫ్‌కోర్సు 'లార్డ్ కృష్ణా' అయుండొచ్చు. ఇంజక్షన్ నేమ్ స్లిప్‌మీద రాసి, వార్డ్‌బాయ్‌ని (హాస్పిటల్) స్టోర్స్‌కి పంపాను—వృత్త చేతుల్తో తిరిగొచ్చాడు. ఇంజక్షన్ ఎవ్వరికీ-ఎందుకూ? అని ఎంక్వైరీ చేశాడట డాక్టర్ రాజేశ్వర్రావు. ఆలస్యం చేస్తే లాభం లేదు. ఆ అమ్మాయి నా వెనకాల బిడ్డనెత్తుకుని రమ్మని "నాకా మెడిసిన్ వెంటనే కావాలి....దయచేసి నన్నిప్పుడేం అడగొద్దు" రాజేశ్వర్రావుకి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా అలమార లోంచి నేనే తీసుకున్నాను—బిడ్డ చేతిమీద నీడిల్‌పెట్టి వైన్ అందుతుందో లేదోనని భయపడ్డాను. భయపడుతూనే నీడిల్ పోక్ చేశాను. గుడ్ హెవెన్స్—వైన్ అందింది.

వండ్రఫుల్ రిజల్టు! విత్ ఇన్ టెన్ మినిట్స్ బిడ్డ శ్వాస గ్రాడ్యుయల్‌గా మారింది. టైమ్ చూస్తూ టెంపరేచర్ తీసుకుంటూ న్నాను. కార్డియా మసాజ్ చేశాను. గ్లూకోజ్ యెక్కించాను. ఒక గంటలో బిడ్డ మామూలుగా రెస్పిరేషన్ చేశాడు.

'థాంక్‌గాడ్' చైల్డ్ ఓవర్ టుక్ డేంజర్ రిలీఫ్‌తో కణతలు నొక్కుక్కుంటూ తలెత్తాను. రౌండ్స్‌కి వచ్చిన డి.యమ్.ఓ, కార్డియాలజీ స్పెషలిస్ట్ డాక్టర్ శాస్త్రి. ఆర్.యమ్.ఓ, చాలామంది డాక్టర్లు నన్నే నిశ్శబ్దంగా గమనిస్తూ ఎదురుగా కనిపించారు.

"బ్యూటిఫుల్ మురళీ. వెల్‌డన్. ఐయామ్ ప్రౌడ్ ఆఫ్ యు మై బాయ్. కమ్ బాయ్స్....ఐ విల్ ఎక్స్‌ప్లైన్ దిస్ కేస్" డి.యమ్.ఓ. హౌస్ సర్జెన్స్‌కి కేస్ ఎక్స్‌ప్లెయిన్ చేస్తున్నాడు. "ఈ డిసీజ్ ఫీవర్‌తో మొదలవుతుంది. చాలామటుకు మలేరియా లక్షణాలు కనిపిస్తాయ్. త్రీడేస్ గడిస్తేకాని ఈవెన్ ఎక్స్‌పీరియన్స్‌డ్ డాక్టర్స్‌కి కూడా దీన్ని కనిపెట్టటం కష్టమే. దీనికి మెడిసిన్‌ని ఇంట్రావీనస్ నించి ఇంజెక్ట్ చేస్తే, 'స్నేక్‌పాయిజన్' దిగినట్టు విత్ ఇన్ మినిట్స్ దిగుతుంది. లేకుంటే అలాగే బ్రెయిన్‌లోకి పాకి పేషంట్ చని పోతాడు. ఈ ఫీవర్ యెక్కువగా చిల్డ్రన్‌లో వస్తుంది. ఇది ఇరవై పదిహేను సంవత్సరాల కిందట యెక్కువగా వుండేది ఇండియాలో. దిస్ ఈజ్ వన్ ఆఫ్ ద పాయిజనస్ ఫీవర్స్, ఈమధ్య ఈ కేసు

చాలా రేర్‌గా కనిపిస్తోంది....” అన్నాడు. నావైపు తిరిగి “ఈ కేస్ నువొక్కడివే యెలా డయాగ్నైస్ చేశావు? అంత పవర్‌ఫుల్ మెడిసిన్ ఎవ్వర్నీ కన్‌సల్టు చెయ్యకుండా డేరింగ్‌గా ఎలా ఇచ్చావు? ఒకవేళ నీ డయాగ్నైజేషన్ మిస్‌టేక్ అయ్యుంటే, ఆ మెడిసిన్ వాడటంతో చైల్డ్ ప్రాణం పొయ్యేది” అన్నాడాయన.

“పార్డన్‌మీ సార్. లాస్ట్‌వీక్ ‘సిల్వర్‌జూబ్లీ ఇష్యూ’ ఒక మెడికల్ జర్నల్ చదివాను. అందులో అంతా మీరు ఇప్పుడు ఎక్స్‌ప్లెయిన్ చేసినట్టే రాసివుంది. మెడిసిన్ వాడకున్నా, ఆలస్యంచేసినా పేషంట్ చనిపోతాడు. చైల్డ్ కండిషన్ చూశాను. హిజ్ లైఫ్ జేమ్ టు మినిట్స్....ఇంకప్పుడు నాకు కన్‌సల్టు చేసే టైమ్ లేదు.... ఆలోచించటానికి టైమ్‌లేదు....మెడిసిన్ వాడకున్నా చైల్డు పరిస్థితి డేంజర్‌లో వుంది. నాడి చూస్తే బతుకగలుగుతాడేమో....రిజల్టు యెలా వున్నా చూస్తూ చూస్తూ ఒక డాక్టర్‌గా....సఫర్‌అవుతున్న పేషంట్‌ని యెలా వదిలేస్తాను? వెంటనే ఏదో చెయ్యాలి....ఫార్మాలిటీస్‌కి టైమ్‌లేదు. అందుకే ఛాన్స్ తీసుకున్నాను. జర్నల్‌లో ప్రిస్‌క్రైబ్ చేసిన మెడిసిన్ మన స్టోర్స్‌లో లేదు—అందుకే ఇదుగోండి ఈ రెండు మెడిసిన్స్ మిక్స్ చేశాను. సేమ్ కాంపౌండ్ ప్రిపేర్ అయింది. వెంటనే ఇంట్రావీనస్ చేశాను అని చెప్పాను” ఆగాడు మురళి.

“అమ్మా ఆయన నన్ను చాలా మెచ్చుకున్నాడు. డాక్టర్స్‌కి ఇలాంటి అలర్టనెస్ వుండాలని, కొన్ని సమయాల్లో డేరింగ్‌గా వుండాలని అన్నాడు. మిగిలిన డాక్టర్సంతా నన్ను అభినందించారు. డాక్టర్‌గా మంచి ఫ్యూచర్ వుంటుందని విష్ చేశారు. ‘యు ఆర్ ప సోల్ డాక్టర్’ అని మెచ్చుకున్నారు. హౌస్ సర్జన్స్ నన్ను హీరో లాగా చూశారు. అమ్మా....ఆలోచిస్తే ఇందులో నా గొప్పతనమేమీ లేదు....నేను ఇంత హేపీగా ఫీలయింది....వాళ్ళంతా నన్ను మెచ్చుకున్నారని కాదు. సమయానికి వెనక్కిపోకుండా బిడ్డ బతకటానికి ఎఫర్టు చేసినందుకు....మన కాంషస్‌కి ఏది మంచని బలంగాతోస్తే అది ఎవరికీ భయపడకుండా జెయ్యాలని, రిజల్టుకోసం ఆశించవద్దనీ

ఎప్పుడూ నువ్వు చెప్పే మాటలేనమ్మా దీనికంతకీ కారణం....నా ధైర్యానికి అదేనమ్మా వెనక వున్న బలం" అన్నాడు మురళి.

"మురళీ నేను చెయ్యలేని పని నువ్వు చేశావు. ఎంత విచిత్రం? ఎంత కో ఇన్సిడెన్స్. కేసు నేను, నేను హౌస్ సర్జన్ చేస్తున్నప్పుడు నా కేరీర్ స్టార్టవక ముందు ఇరవైయ్యేళ్ళక్రితం నాకు ఎదురైంది. అఫ్‌కోర్స్ అదే నా ఫస్ట్‌కేస్. ఆ రోజు నేను ఏవో అర్థంలేని భయాలతో చెయ్యలేకపోయాను. అదే నువ్వు ఈ రోజు డేరింగ్‌గా చేశావు. ఐయామ్ ఆల్వేస్ ప్రౌడ్ ఆఫ్ యు మురళీ.... ఈ శక్తి, ఈ ధైర్యం, ఈ దయ....నీకు లైఫ్ అంతా తోడుగా వుండాలని లార్డ్ కృష్ణాని ప్రార్థిస్తున్నాను. నీ డ్యూటీని గురించి ఎప్పుడు రిగ్రెట్‌గా ఫీలవవు. మనిషిగా ముందుకు పోవాలంటే అదే కావాలి" అన్నాను.

"అమ్మా ఫ్రెండ్స్ పార్టీ ఇవ్వమంటున్నారు."

"అలాగే ఇవ్వు బాబూ. మర్చిపోయా. వాషింగ్‌టన్‌నించి అబ్రహాంలింకన్ హాస్పిటలో నీకు 'కార్డియాలజీ' స్పెషలైజేషన్‌కి సీటు ఇస్తున్నట్టు ఇన్‌ఫర్‌మేషన్ వచ్చింది."

"ఐతే నీ ఫ్రెండ్స్‌ని కూడా ఇన్‌వైట్ చేద్దామమ్మా...." అంటూ మురళీ ఎవరో పిలిస్తే బైటికి వెళ్ళాడు.

బైటికి వెళ్తున్న మురళిని చూస్తూ, ఆ వయసూ—ఆవేశం వున్న ఇరవైయ్యేళ్ళ కిందటి నాగతం లోపలికి వెళ్లాను.

## 2

తాతయ్య ఇంగ్లండునించి బ్రిటిషర్స్ టైమ్‌లో ఇండియాకి వచ్చి సెటిల్ అయిపోయాడు. ఆల్‌మోస్ట్ ఇండియన్ సిటిజన్ అయినాడు. మా అమ్మకి ఈ దేశం నచ్చలేదు. నాన్నతో ఇంగ్లండు వెళ్ళిపోయింది. నేను అమ్మదగ్గిర ఐదేళ్ళొచ్చేదాకా పెరిగానేమో. తాతయ్య నన్ను ఇండియా తీసుకొచ్చారు. తాతయ్యని మనిషిని చూస్తే యూరోపియన్ అనుకుంటారు. కానీ—ఆయన పద్ధతులన్నీ ఇండియన్స్‌వే! సివిలైజ్‌డ్ ఇండియన్, ఎరియల్ హిందూ ఆయన.

ఆయన 'కృష్ణ చైతన్యం' ఫాలోయర్. లార్డ్ కృష్ణా అంటే ఆయనకి విపరీతమైన నమ్మకం, భక్తి. భగవద్గీత రోజూ చదివేవారు. నాకూ చెప్పేవారు. చెప్పటమేకాదు ఆచరించేవారు. నాకు సెవెంటీన్త్ ఇయర్ వచ్చింది. అమ్మ ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో చదివించాలని పట్టుబట్టింది. తాతయ్యని వదిలి వెళ్ళటం ఇష్టంలేకున్నా, చదువు కోసం ఇంగ్లండు వెళ్ళాను. మెడిసిన్ చదివాను. అక్కడ ఐదేళ్ళున్నా చిన్నప్పటినుంచీ నాలో తాతయ్య నాటిన భావాలు మారలేదు. మెడిసిన్ కోర్సు అయిపోవచ్చింది. నన్ను మారేజ్ చేసుకుని, లండన్‌లోనే సెటిల్ అయిపొమ్మని చెప్పేది అమ్మ నాకు. కానీ నా ఆలోచనలూ ఆశ అంతా ఇండియామీదే. తాతయ్యతో కలిసి దాదాపు ఇండియా అంతా చూశాను. రెలిజియాసిటీ, నేచర్‌బ్యూటీ, అమాయకత, ఆత్మీయతతోపాటు-నిరక్షరాస్యత, దరిద్రం,మూర్ఖత్వం, అనారోగ్యంతో ప్రజలు బాధపడటం చూశాను. వాళ్ళమధ్య బతుకుతూ . వాళ్ళకి నా చేతనయినంతవరకు సహాయం చెయ్యాలి.... వాళ్ళ కష్టసుఖాలు కలిపి పంచుకోవాలి అనే ఆకాంక్ష నన్ను నిలవనీయకుండా చేసేది. అది ఎలా తీరుతుందాయని లోలోపల మధన పడుతున్న సమయంలో....ఇండియన్ ఎక్స్‌ప్రెస్, ప్రెస్ తరపున 'శర్మ' ఇంగ్లండు వచ్చాడు—తాతయ్య దగ్గిర్నుంచి లెటర్‌తెచ్చాడు. లండన్‌లో వున్న పదిరోజులూ మా ఇంట్లోనే వున్నాడు.

ఇండియా అన్నా, ఇండియన్స్ అన్నా ఎంత క్రేజీగా వుండేదాన్నో అప్పుడు. అందుకే శర్మగురించి ఏం తెలుసుకోకుండా, ఎక్కువ ఆలోచించకుండా....అతన్నిగురించి ఏ అభిప్రాయం ఏర్పడకముందే....అతన్ని మారేజ్ చేసుకుని ఇండియా రావటానికి తయారయ్యాను. అమ్మ నా మనసు మార్చలేక సరేనంది. మేరేజ్ అయిన వెంటనే ఇండియా వచ్చేశాను. ఇండియాలో సెటిల్ అవటానికి ఈ మేరేజ్ నాకు 'ఎక్స్‌క్యూజ్'!

నేను వచ్చేసరికే తాతయ్య జబ్బుగా వున్నాడు. హైదరాబాద్‌లో వున్న ఈ బంగళా నాకు వదిలేసి, ఆయన అమ్మతో ఇంగ్లండు వెళ్ళిపోయాడు. హౌస్ సర్జన్ వుస్మానియాలో చేశాను-

మా పెళ్ళితో శర్మ కుటుంబం అతన్ని వెలేసింది. కానీ శర్మకి మాత్రం ఎప్పుడూ తన కమ్యూనిటీతో కలిసివుండాలని ఇష్టంగా వుండేది. నావల్ల తనవాళ్ళకి దూరమయ్యానని పదేపదే అనేవాడు. ఫ్రెండ్స్‌కి పుత్తరాలు రాయమని శర్మకి చెప్పాను. చుట్టాలకంటే ఫ్రెండ్స్ లిబరల్‌గా వుంటారని, వాళ్ళు ఆహ్వానిస్తే, కార్డియల్‌గా వెళ్దామనీ....అలా వాళ్ళకి తను దగ్గర కావచ్చనీ నేనే శర్మకి సలహా యిచ్చాను. దాని ఫలితమే మేము శర్మ ఫ్రెండ్ అవధాని వాళ్ళ వూరెళ్ళటం.

గోదావరి జిల్లాలో పల్లెటూరు, అవధానీవాళ్ళ వూరు. చాలా అవస్థపడి కన్‌వేయన్స్ లేని ఆ పల్లెటూరు పొద్దున్నే చేరాము. వూరి బయట పాడుబడిన గుడిలో నన్ను కూచోబెట్టి శర్మ వూళ్ళోకెళ్ళాడు. వెళ్ళిన గంటలో తిరిగొచ్చాడు. అవధాని లేడుట. సాయంత్రానికి కాని రాడుట. అంతదాకా వుండమని వాళ్ళ యింట్లోవాళ్ళు చెప్పారుట. వాళ్ళకి నేను శర్మతోపాటు వచ్చినట్టు తెలీదు. హోటల్ లేని ఆ వూళ్ళో శర్మ తెచ్చిన జంతికలూ, పల్లివుండలూ తిని పగలంతా గుడిలో గడిపాము.

సాయంకాలం అవధాని వచ్చాడు. నన్ను చూసి ఆశ్చర్యపోయాడు. "నువ్వు చెప్తేకానీ నమ్మరు ఈవిడ సీమదొరసాని అంటే, కట్టూబొట్టూ చాలామటుకు మనలాగే వుంది. కానీ కళ్ళ రంగూ, జుట్టురంగూ, ఒంటిరంగూ ఇట్టే పట్టిస్తాయ్. సరే అమ్మ వాళ్ళకి నచ్చచెప్పాను. ఇంటికెళ్దాం రండి" అంటూ వాళ్ళ ఇంటికి తీసికెళ్ళాడు. పచ్చటి అరటిచెట్లూ, కొబ్బరిచెట్లూ, చల్లగా గలగలా పారే గోదావరి చూస్తూ చీకటిపడి ఇల్లు చేరాము. పొద్దున్నించీ ఏం తినలేదు-పైగా ముందురోజు రాత్రి ప్రయాణం-నాకు చాలా అలసటగా జ్వరం వచ్చినట్టు వుండింది. పాలు, రొట్టె ఇచ్చారు నాకు వాళ్ళు. శర్మకి హాల్లో భోజనం పెట్టారు. బైట వసారాలో కుర్చీలో కూచున్నాను.

అమెచ్యూర్ ఏజ్‌డ్ భార్య, మూడేళ్ళ కొడుకూ, మూడునెలల బిడ్డా, వంగిపోయిన తండ్రీ, ఆచారవంతురాలైన తల్లీ-ఇది అవధాని

కుటుంబం. స్కూలుమాష్టరి వుద్యోగం, నాటువైద్యం అవధాని ఆక్యుపేషన్స్. అవధాని కొడుకు మూడేళ్ళ కుర్రాడు మెల్లిగా నడుస్తూ వాకిట్లోకి వచ్చాడు. బైటవున్న విరిగిపోయిన స్కూల్ బెల్‌ని తట్టుకుని పడ్డాడు. గబుక్కుని నేను బిడ్డని ఎత్తుకున్నాను. పిల్లాడి ఏడుపు విని తల్లి బైటికొచ్చింది. నాతో మాట్లాడటానికి ఆమె సిగ్గుపడుతోంది. భయపడ్తోంది. ఆమెకి పదహారేళ్ళు వుండొచ్చు. అప్పుడే ఇద్దరు బిడ్డల తల్లి! చేతిలోవున్న బిడ్డమొహం చూస్తూంటే నాకేవో అనుమానం వేసింది. బిడ్డలో జబ్బులక్షణాలు కనిపించాయ్. బిడ్డని పరీక్ష చేశాను. టెంపరేచర్ చూశాను. మళ్ళీ ఐదునిమిషాలకి చూశాను. ఆశ్చర్యం నిమిషాల్లో టెంపరేచర్ ఛేంజ్ అవుతోంది. బిడ్డ మొహం ఎర్రగా వుద్చింది. శ్వాసబరువుగా తీస్తున్నాడు

'ఇలా ఎన్ని రోజులనించి వుందని' అడిగాను. ఆమె మూడు వేళ్ళు చూపించింది. వెనకా ముందు ఆలోచించకుండా ఇంట్లోకి వెళ్ళాను. శర్మ నన్ను కోపంగా చూశాడు. బిడ్డ పరిస్థితి ప్రమాదంగా వుందని అవధానికి చెప్పాను. మందులు వాడతానన్నాను. బాగ్ తియ్యబోతూంటే శర్మ తెలిసీ తెలియని వైద్యంచేసి బిడ్డకేదైనా చేశావంటే....అసలే పల్లెటూరు. మనం ప్రాణాలతో బైటికి వెళ్ళం. పైగా ఇప్పుడు మనం స్నేహాన్ని కలుపుకోటానికి వచ్చాం. గుర్తుంచుకో. ఇంకా ఏవేవో అన్నాడు. నన్ను భయపెట్టాడు. అవధాని మాత్రం నవ్వుతూ "మేము వైద్యం చేస్తున్నాం. ఆడవాళ్ళకేం తెలుసు? వాళ్ళు అందమైన బొమ్మలు మాత్రమే" అన్నాడు శర్మతో.

"సెమీడాక్టర్‌వి నువ్వేం అవసరం లేదు. అవధానికి వైద్యంలో చాలా ఎక్స్‌పీరియన్స్ వుంది. అతని కొడుకు సంగతి అతనికి బాగా తెలుసు" అన్నాడు శర్మ.

కొంచెంసేపు నిశ్శబ్దంగా వాకిట్లో కూచున్నాను. తల్లిచేతిలో నిలవకుండా బిడ్డ మూలుగుతున్నాడు. ఆ మూలుగు నా గుండెల్లోంచి దూసుకుపోతోంది. ఇంక ఆగలేకపోయాను. అవధాని తల్లి, తండ్రి వాకిట్లోకి వచ్చారు. వాళ్ళకి లేచి నమస్కారం చేశాను. వచ్చీరాని

తెలుగులో బిడ్డపరిస్థితి ప్రమాదంగా వుందని, దయచేసి హాస్పిటల్ తీసుకువెళ్ళటానికి అనుమతి ఇవ్వమని బతిమాలాను. ఆలస్యంచేస్తే బిడ్డ దక్కడని భయపెట్టాను. వాళ్లు అర్థంచేసుకున్నారు. పైగా బిడ్డ మూలుగు అంతకంతకీ ఎక్కువౌతోంది.

వెంటనే రాజాగారి ఇంటికి గుర్రపు సార్టుకోసం అవధాని వెళ్ళాడు. ఇక అప్పట్నించీ ప్రతీనిమిషం నాకొక గంటలాగా గడిచింది. పిల్లాణ్ని ఎత్తుకుని టౌనుకి పరిగెడ్దామనుకున్నాను. నన్నెలా కంట్రోల్ చేసుకున్నానో నాకే తెలీదు. నన్ను సొంతంగా ఏం వైద్యం చెయ్యొద్దని శర్మ కట్టడి. నా కాళ్ళూ, చేతులూ కట్టేసినట్టయింది. కానీ నా మనసు మాత్రం మామూలుకంటే వేగంగా పనిచేస్తున్నది. బండి వచ్చింది. పసిబిడ్డని పట్టుకోటానికి అవధాని వదినె, అవధాని భార్య అవధాని, మేము....ఆ పల్లెకు నాలుగు మైళ్ళదూరంలోవున్న టౌన్‌కి బైలుదేరాము. ఏదో ఫెస్టివ్‌మూడ్‌లో తిరనాల కెళ్తున్నట్టు ఏమీ తెలియని అమాయకురాలు అవధాని భార్య, తెల్లదొరసానినైన నా పక్కన కూచుని ప్రయాణం చెయ్యగలుగుతున్నందుకు మురిసిపోతూ అవధానీ, తనని వెలెయ్యకుండా వాళ్ళల్లో కలుపుకున్నందుకు మహా ఆనందంలో శర్మ, బిడ్డప్రాణం పోతుందేమోనని ఆదుర్దాతో నేనూ-ఒక బండిలో తలా ఓవేపూ ప్రయాణం చేస్తున్నాము.

మధ్యలో ఏదో గుడి వచ్చింది. అమ్మవారి జాతరట. పెట్రోమాక్సు లైట్లలో, డప్పులతో కోలాహలం. బండి ఆగింది. ఇది సమయంకాదు—ఒద్దన్నాను. నా మాట ఎవ్వరూ వినిపించుకోలేదు. చేతిలో నిలవని బిడ్డనెత్తుకుని అవధాని, అతనివెనక అతని కుటుంబం, శర్మ చివరికి బండితాత అందరూ జనంలోంచి గుడిలోకి వెళ్ళొచ్చారు. ఆ రావటం నాకొక యుగంలా తోచింది. తిరిగి బండెక్కేసరికి వాళ్ళు కూడాబిడ్డ పరిస్థితి ప్రమాదంగా వుందని తెలుసుకున్నారు. జోగుతున్న బండి తాతని పక్కన కూచోమని, కళ్ళాలు చేతికి తీసుకుని వేగంగా బండి తోలాను. పెద్ద గవర్నమెంట్ హాస్పిటల్....చేరాము. ఎవ్వరి కోసం ఆగకుండా, ఎవ్వర్నీ అడగకుండా బిడ్డని నా చేతులోకి ఎత్తుకుని లోపలికి వెళ్ళాను. నేను హైదరాబాద్‌లో డాక్టర్నని, ఇంజక్షన్స్

పేరు చెప్పి అవి వెంటనే ఇవ్వమని నర్సుకి చెప్పాను. నన్ను చూచి వాళ్ళు గౌరవించారు. హాస్పిటల్ కాంపౌండులోనేవున్న ఆర్.ఎమ్.ఒ క్వార్టర్స్‌కి మనిషిని పరిగెత్తించారు.

హాస్పిటల్లో వంగిపోయిన సీడిల్, దొరకని మందులూ ఎదురయ్యాయి. మళ్ళీ ఆలస్యం. డాక్టర్ వచ్చింది. ఆమె మిషనరీ డాక్టరు. ఇంగ్లండునించి వచ్చిందిట. నన్నుచూసి నేటివ్‌లాండ్ చూసినంత సంతోషించింది. నా కివేం పట్టలేదు. నా ఆదుర్దాచూసి బిడ్డకి ఇంజక్షన్ నన్నే ఇవ్వమంది. బిడ్డ వైన్‌లో సీడిల్ పోక్ చేశాను. ఉహూ.... వైన్ అందలేదు. ఆమె చేతికి సిరెంజి ఇచ్చి కళ్ళు తిరుగుతూంటే పక్కనున్న గోడకి ఆనుకున్నాను. ఆమె మొహం విచారంగా మారిపోయింది. "నో యూజ్, ఛెయిల్డ్ ఆల్‌రెడీ డైడ్....ఒక్క పదినిమిషాలముందైతే ఛెయిల్డ్ బతికే ఛాన్స్ వుండేది" అంది. 'పది నిమిషాలు!' ఎక్కడ ఆలస్యమైందని చెప్పను? శర్మతో డిస్కషన్ లోనా? అవధాని కుటుంబాన్ని కన్‌సోల్ చేసేటప్పుడా? బండీ రావటానికా? పోలేరమ్మ జాతరలోనా? ఎక్కడ? నన్ను మాయచేసి దాటిపోయిన ఆ పది నిమిషాలు? నాకు స్పృహ తప్పింది.

నేను లేచాక మిషనరీ డాక్టర్ నన్ను మెచ్చుకుంది. తన క్వార్టర్స్‌కి తీసికెళ్ళి. వూళ్ళో ఆఫీసర్స్‌కి నన్ను, శర్మనీ పరిచయం చేసింది. నేను చేసిన పని పెద్ద అడ్వెంచర్ అని పొగిడింది. యూరోపియన్స్‌కి తప్ప ఆ పుష్ ఎవ్వరికీ వుండదని గర్వపడింది. అందరూ నన్నభినందించారు. శర్మ. కళ్ళు పెద్దవి చేసుకుని చూశాడు. గౌరవం పెంచుకున్నాడు. ఆ వూళ్ళో ఆఫీసర్స్ మా ఇద్దరినీ ఇళ్ళకి ఆహ్వానించారు. శర్మ తన ఆర్టికల్లో వాళ్ళ పేర్లనికూడా ఇన్‌క్లూడ్ చేస్తానని, పేపర్‌లో ఆర్టికల్ వస్తుందనీ వాళ్ళకి చెప్పాడు. ఆ అనుభూతి ఎంజాయ్ చేస్తూ, ఆ డెవిల్ ప్లెజర్ అనుభవిస్తూ నా చెవిలో రహస్యంగా "నన్నుగురించి మొట్టమొదటిసారిగా గర్వపడుతున్నట్టు" చెప్పాడు. అవధాని దంపతులు అంత దుఃఖంలోకూడా నేనుచేసిన పనికి మెచ్చుకున్నారు! నాకేం సంతోషంలేదు. నేను తలెత్తలేకపోయాను. ఐ పెల్ట్ గిల్టీ. నాకు రహస్యంగా శర్మమీద, చాదస్తాల

మీద, పరిస్థితులమీద, చివరికి నామీద విసుగేసింది అందరి ఆహ్వానాలూ తిరస్కరించి, శర్మని అక్కడే వదిలేసి బైర్గిసెక్కేశాను.

# 3

ఎలా జర్నీచేశానో నాకు తెలీదు. స్టేషన్నించి నేరుగా ప్రొఫెసర్ రావ్ ఇంటికెళ్ళాను. ఆ రోజు సన్డే. డాక్టర్ రావ్ హాల్లో కూచుని జర్నల్స్ చూస్తున్నారు. నేను రావటం చూసి, లేచి "గుడ్ డే కృష్ణా....కమిన్" అంటూ ఆహ్వానించారు. ఆయన్ని విష్ చెయ్యటానికి కూడా నాకు గొంతురాలేదు. అప్పటివరకూ అణచుకున్న దుఃఖం ఒక్కసారి పైకొచ్చింది. సోఫాలో కూచుని రెండు చేతులతో మొహం కప్పుకుని ఏడ్చేశాను. వెక్కిళ్ళతో ఏడ్చాను. కంట్రోల్ చేసుకోలేక ఏడ్చేశాను. పదిహేను నిమిషాలకి నా కంట్రోల్లోకి వచ్చాను. తలెత్తి ప్రొఫెసర్ని చూశాను. ఆయన నా తలమీద చెయ్యేసి "గెట్ అప్ కృష్ణా. వెళ్ళి మొహం కడుక్కునిరా" అన్నారు. బాత్రూంలోంచి హాల్లోకొచ్చేసరికి టేబిల్మీద కాఫీ వుంది. కాఫీ తాగాను. కొంచెం రిలీఫ్ వచ్చింది.

"ఊఁ - ఫస్ట్కేస్ ఫెయిలయింది. పేషంట్ డైడ్ కదూ...." అన్నాడాయన సానుభూతిగా నావేపు చూస్తూ. ఆయన సరిగ్గా వూహించాడు. నేను వర్క్కి ఎంత డివోట్ అవుతానో ఆయనకి తెలుసు.

"అవును....ఇట్ హేపెండు కంప్లీట్లీ మిసరబులీ సార్.... ఆ సిట్యుయేషన్లో నేను డాక్టర్ని కాదు.. ఆడియన్గా వున్నాను. ఐ వాజ్ జస్ట్ ఏ విట్నెస్...." జరిగిందంతా వివరంగా చెప్పాను. ఆయన మెల్లిగా వూకొట్టూ విన్నారు.

"కానీ దీంట్లో నీ తప్పేంలేదు. నీ ప్రయత్నం నువ్వుచేశావు. ఇట్ హేపెండు జస్ట్ బియాండ్ డాక్టర్స్ ట్రై. దెన్ డోంట్ ఫీల్ మై ఫెయిల్డ్."

"నో. నా డ్యూటీ నేను సిన్సియర్గా చేసుంటే ఫీలయ్యేదాన్ని కాదు. నేను చెయ్యలేదు. లోకానికి భయపడ్డాను. అతనికి భయపడ్డాను. పేరుకి భయపడ్డాను. డాక్టర్గా నా డ్యూటీని ఆ భయం

చాటుకి నెట్టాను. ఐ కాంట్ ఫర్‌గెట్ మై సెల్ఫ్....ఫార్ ఎవర్."

"అలా అనుకోవద్దు. ఆ పరిస్థితుల్లో ఏ మెడికో అయినా అలాగే చేస్తాడు. నీకు ఎక్స్‌పీరియన్స్ లేదు. ఇండియాలో సిటీస్ చూశావు. ఇక్కడ పల్లెటూళ్ళల్లో మనుషులు ఎంత మూఢనమ్మకాలతో వుంటారో నీకు తెలీదు. ఇంకా నయం. నిన్ను వాళ్ళ కమ్యూనిటీలోకి ఆహ్వానించారు. నీ మాటలకి విలువిచ్చారు. చివరికి చైల్డ్ చావుని ఏదో విధినిర్ణయం కింద తీసుకున్నారు. అదే నీవు వైష్యం చేసి జరిగుంటేనా? నువ్వు, నీ భర్తా ఆ వూరినించి ప్రాణాలతో బైటికి రాగలిగే వాళ్ళుకాదు. చూడు కృష్ణా కొన్నిసార్లు 'కేస సక్సెస్' ఒక్క డాక్టర్ ఎఫిషియన్సీ మీదే ఆధారపడి వుండదు. సర్‌కమ్‌స్టెన్సస్, అవైలబిలిటీ ఆఫ్ మెడిసిన్స్....ఇలా ఎన్నో-డాక్టర్‌గా కొంతపేరు రానీ. ఆ రోజు నువ్వు అనుకున్నవి అనుకున్నట్టు క్షణాల్లో చెయ్యగలవు." అన్నారు ప్రొఫెసర్ రావ్. అవధాని కొడుకు కేస్ గురించి కొన్ని డీటైల్స్ చెప్పి, మెడికల్ జర్నల్స్‌లో లేటెస్ట్ మెడిసిన్స్ వివరించారు. నేను చేసిన డయాగ్నైజేషన్, వూహించిన మెడిసిన్ సరిగ్గా వున్నాయని, నాకు డాక్టర్‌గా మంచి భవిష్యత్తు వుందనీ విష్‌చేశారు. ప్రొఫెసర్ రావ్ మాటలతో కన్‌సోల్ అయి ఇంటికొచ్చాను.

వూరికి తీసికెళ్ళిన బాగ్ దులుపుతూంటే, ఒక ఇంజక్షన్ బాటిల్ కిందపడి పగిలిపోయింది.అది నా డాక్టర్ ఫ్రెండ్‌కి శాంపిల్‌గా ఇచ్చిన బాటిల్. పగిలిపోయిన గ్లాస్ పీసెస్‌మీద అక్షరాలు,మూడుగా, నాలుగ్గా మల్టిప్లై అయి నన్ను వెక్కిరించాయి. అది....నా దగ్గిరే పెట్టుకుని, అవధాని కొడుక్కి నేనివ్వలేకపోయిన ఇంజక్షన్!

కళ్ళలో నీళ్ళు నిండి మసకగా కనిపిస్తూంటే, పగిలిన గాజు ముక్కలు తొందరగా ఏరిపారేద్దామని, నా అసమర్థతని వెయ్యి ముక్కల్లోంచి వేలెత్తి చూపుతున్న ఆ పీసస్‌ని కనపడకుండా చేద్దామని తొందరగా అడుగేసేసరికి, గ్లాస్ పీస్ కాలులో గుచ్చుకుంది. దాన్ని లాగేశాను. కానీ మనసులో గుచ్చుకున్న ముల్లు లాగెయ్యలేకపోయాను. ఇట్ ఈజ్ స్టిల్ ఏక్టింగ్.

ఆ సంవత్సరంలో నా హౌస్‌సర్జన్ పూర్తయింది. తాతయ్య పోయారు. నా కోసం ఆయన ఫిఫ్టీ థౌజండ్స్ పంపించారు. ప్రైవేట్ ప్రాక్టీస్ పెట్టాను. నా అదృష్టమేమో, వచ్చిన ప్రతికేసూ సక్సెస్ అయింది. అప్పుడు లేడీ డాక్టర్స్ అంత ఎక్కువగా లేరేమో? అందులో 'సీమ డాక్టర్నని' ప్రత్యేకంగా అరిస్టోక్రేట్ ఫామిలీస్ నా దగ్గిరికి వచ్చేవాళ్ళు. పేషంట్స్ ఇళ్ళకి విజిటింగ్ టైమ్స్ పెట్టుకున్నాను. వారానికి మూడుసార్లు చుట్టుపక్కల పల్లెలకి 'మొబైల్ ట్రీట్‌మెంట్'కి వెళ్ళేదాన్ని. పేరూ, డబ్బూ ఐదేళ్ళలో అనుకోనంతగా వచ్చాయి. క్లినిక్‌ని హాస్పిటల్‌గా మార్చాను. మెటర్నిటీ హోమ్ పెట్టాను. నా కెరీర్ ఇంత స్టీప్‌గా రైజ్ అవుతూంటే, నా పర్సనల్ లైఫ్ రోజు రోజుకీ దిగజారిపోయింది. శర్మకి, పని చేస్తున్న ప్రెస్‌లో ఏదో మాట పట్టింపుతో వుద్యోగం పోయింది. వేరే చిన్న పత్రికలో సబ్ ఎడిటర్‌గా చేరాడు. ఇదేం నేను పట్టించుకోలేదు. నేను బాగా సంపాయిస్తున్నాను. అతనే ఆర్ట్ డెవలప్ చేసినా, జర్నలిజం ఇంప్రూవ్ చేసుకున్నా, అందుకు ఫారిన్ వెళ్ళినా నేను సంతోషించేదాన్ని. ఫైనాన్సియల్‌గా అతనికేం ఇబ్బంది లేకుండా చూసేదాన్ని.

కానీ అతనికి మాత్రం నా గురించి అభిప్రాయాలు వేరుగా వుండేవి! నాకు పేరు వస్తూంటే అతనికి అసూయ యెక్కువైంది నామీద. ఏదో అనుమానం, ఏమిటో భయం. వీటితో వుడికిపొయ్యేవాడు. వాటిని మాటల్లో వ్యక్తం చెయ్యటానికి వెనక్కి తీసేవాడు కాదు.

"చదువుకుంటేనేం, సంపాయిస్తేనేం ఆడదానికి వుండాల్సింది భయం—వినయం. నువ్వు కేవలం నా భార్యవి. నేను చెప్పినట్టు ప్రతీ విషయం వినాలి. ఇండియాలో పెరిగావంటే మా ఇండియన్స్‌లాగే వుంటావనుకున్నాను కానీ రక్తంలో అహంకారం ఎక్కడికి పోతుంది....నీ కెరీర్‌కంటే నాకు సేవ చెయ్యటమే నీకు ముఖ్యమైన డ్యూటీ" అని నీతులు చెప్పేవాడు. అలా చెయ్యాలని ఆశించేవాడు. ముందు ముందు అతని మాటలని పట్టించుకునేదాన్నికాదు. దాంతో

మరీ విపరీతంగా ప్రవర్తించేవాడు. మామూలుగా భారతీయస్త్రీని, అతనిమీద ఆధారపడ్డ మనిషిని ఐతే ఏం చేసేదాన్నో కానీ ను ఆ రెండూ కాదు. అందుకని అతని మాటలప్రకారం నడవటం నాకు వీలయ్యేదికాదు. నాకేకాదు. అతను చెప్పినట్టు చెయ్యటం, అతన్ని తృప్తి పరచటం దేవతలకి కూడా సాధ్యమయ్యే పని కాదు.

భార్యాభర్తల మధ్య వుండాల్సింది భయం కాదు. ప్రేమా—ఆప్యాయతా. వాటిల్లో మొదటిది అతనిమీద నాకెప్పుడూ కలగలేదు. కలగటానికి అతను అవకాశం యివ్వలేదు. అతను సుఖంగా వుండాలని, అందుకు కావల్సింది చెయ్యగలిగితే చెయ్యాలని నాకుండేది. అది అర్థం చేసుకుని వుంటే అతను తను సంతోషంగా వుండటమేకాక నన్నుకూడా మనశ్శాంతిగా బతకనిచ్చేవాడు. నేను విపరీతమైనపనితో అలిసి వచ్చి నవ్వుతూ పలకరించినా కఠినంగా మాట్లాడేవాడు. నొప్పించటానికే ప్రయత్నించేవాడు. తన గురించి నేను మనసులో తన చెడు కోరుకుంటున్నాననీ, మోసపోయి నాలాంటిదాన్ని చేసుకున్నాననీ జాతిభ్రష్టుడయ్యాడనీ పదేపదే నొచ్చుకునేవాడు. ఈ దేశంలోని సదాచార సంపన్నుల ఇంటిపిల్లని చేసుకునివుంటే, తన అదృష్టం అలా అయ్యేది కాదని, ఆవిడ పాతివ్రత్యం తనని కాపాడేదనీ అనేవాడు. తనిలా కావటానికి సొసైటీలో నేను గైన్ చేసుకుంటున్న పేరనీ, నా బిహేవియర్ బాగాలేదని అందరూ అంటున్నారని (అది అబద్ధమని అతనికి పూర్తిగా తెలిసినా) అనేవాడు. అతను అన్న మాటల్ని నిజం చెయ్యటానికి క్షణం పట్టదు నాకు. కానీ యెవరి ప్రవర్తన ఫలితం వాళ్ళకే చెందుతుందని నాకు తెలుసు.

నామీద ఇంత కోపం, పగ వున్నప్పుడు దాన్ని ఎప్పుడూ ఒకటేగా ఎక్స్‌ప్రెస్‌చేస్తే నేనెంతో సంతోషించేదాన్ని. కాని మరో గంటలో (డబ్బు కావల్సి వచ్చినప్పుడూ, సెక్స్ అవసరం ఏర్పడ్డప్పుడు) నన్ను పొగడ్తలతో ఆకాశానికెత్తేసేవాడు. కొత్త మనిషిగా మారిపొయ్యేవాడు. ఇది మాత్రం నాకస్సలు సరిపడేది కాదు. మనిషైనవాడు ఒకే రకమైన ప్రవర్తనకు స్టిక్ ఆన్ కావాలి. ఇలా వూసరవిల్లిలా రంగులు మార్చటం, తనని తను కించపరచుకోటం

చూచి నాకు అసహ్యం వేసింది—శర్మలోని అపర్చ్యూనిజమ్, అగ్లీ టెంపర్‌మెంట్ నేను భరించలేకపోయాను. అతనిమీద కోపం—ద్వేషం కలగలేదు. అవి సమానస్తులమీద కలుగుతాయి. అతనిమీద విపరీతంగా జాలేసింది. అసహ్యం వేసింది. జాలితో, అసహ్యంతో పనివాళ్ళనీ, పిల్లలనీ, తల్లితండ్రుల్నీ, అన్నదమ్ముల్నీ భరించ వచ్చేమోకానీ భర్తని మాత్రం కాదు. భర్త యెప్పుడూ స్త్రీ దృష్టిలో ఒక మెట్టు వున్నతస్థాయిలో వుండాలి. అమాయకతని సహిస్తాను, మూర్ఖత్వాన్ని క్షమించగలను కానీ అహంకారాన్ని సహించటం నేను నేర్చుకోలేదు. నాకు అవసరంలేదు. ఎప్పుడైతే ఈ నిర్ణయాని కొచ్చానో, వెంటనే అతనితో నాకు నామమాత్రంగా వున్న బంధాన్ని తెంచుకున్నాను. అతను నన్ను వదిలి దూరంగా వెళ్తే అతనికి ఖర్చు లకి డబ్బు పంపిస్తానని చెప్పాను.

తర్వాత వారంరోజులకి వాళ్ళ వూరెళ్ళి తిరిగొచ్చాడు. అతని అన్నయ్యలు అతని జీవితం పాడైపోవటం చూడలేక 'మంచి వంశంలోంచి వచ్చిన' వాళ్ళచుట్టాలమ్మాయినిచ్చి పెళ్ళి చేశారట. అది తనకే మాత్రం ఇష్టం లేదుట. కానీ పాపం ఏం చేస్తాడు! పెళ్ళి బల వంతంగా చేశారు! అమ్మ బావిలో దూకుతానన్నది. ఒదినెగారు వురి పోసుకుంటామన్నారు! వున్న విషయాన్నీ ఫ్రాంక్‌గా చెప్పలేని అతని పిరికితనానికి విచారించాను. ఈ విధంగానైనా నన్ను ఒదిలి పోతున్నాడని సంతోషించాను.

ఆ వూళ్ళో ప్రెస్‌పెట్టుకుంటానని పదివేలు అడిగాడు. ఈ పెళ్ళితోనైనా తృప్తిగా—సంతోషంగా వుంటాడని ఆశించాను. కానీ నాకు నమ్మకంలేదు. కంటెంట్—హేపీనెస్ అన్నవి మనసుతో ముడిపడినవి. అవి పొందాలంటే మనిషి మనసు యెంత గొప్పగా వుండాలి!

ఇంత జరిగినా నా ప్రాక్టీస్ తగ్గలేదు. నాకేం చెడ్డపేరురాలేదు. ఎకనమికల్ స్టాండింగ్‌వున్న ఆడదానికి సంఘంమీద ఎంత కంట్రోల్ వుంటుందో....ఆ రోజైనా, ఈ రోజైనా అది ఒకటే అని నాకు తెలిసింది—అదే నాకు లేకుంటే భారతదేశంలోని లక్షలాది స్త్రీల

లాగా అసహాయతతో అణిగిపొయ్యేదాన్ని—బానిసబ్రతుకు బతికే దాన్ని. నా రొటీన్, లైఫ్ మార్పులేకుండా సాగిపోతోంది. అలాం టప్పుడు రోజుకీ-రోజుకీ తేడా లేదు—జరుగుతున్న కాలానికి కౌంట్ లేదు. నాకు ఇప్పుడు ఒకటే కాన్సన్‌ట్రేషన్....వర్క్....వర్క్. అంతే! ఐ వెడెడ్ టు మై వర్క్.

## 4

నర్సింగ్‌హోమ్‌నించి వచ్చి, కళ్ళు మూసుకుని ఈజీఛేర్‌లో పడుకున్నాను. చప్పుడుకి కళ్ళు తెరిచాను.

తలుపుపక్కన స్టూలుమీది ఫ్లవర్‌వాజ్ కింద పడి వుంది. తలుపు కిందనుంచి చిన్నచిన్న పాదాలు, దుమ్ముకొట్టుకుని వున్న లేత పాదాలు—తలుపు చాటునించి దుబ్బులాంటి నల్లటి వుంగరాల జుట్టు తొంగిచూస్తూ కనిపించాయి.

"ఎవరక్కడ? ఇవతలికి రా...." కుతూహలంగా లేచి కూచు న్నాను. చేతిలో మాసిపోయిన సంచీ, దాన్ని దాచటానికి అవస్థ పడుతూ, తడబడుతున్న అడుగులతో ఎవరో తోసినట్టు ఆ అబ్బాయి ఇవతలికి వచ్చాడు.

"మురళీ నువ్వా?" లేచి గబగబా దగ్గిరికి వెళ్ళి వాణ్ని చెయ్యి పట్టుకున్నాను. "ఒక్కడివే వచ్చావా? నాన్న కూడా వచ్చాడా?" తలెత్తి నా మొహంలోకి చూశాడు. ఎర్రటి బూరెబుగ్గలమీద ఎండి పోయిన కన్నీటి చారలు.

"ఏడ్చావా బాబూ? ఎందుకూ?" అన్నాను.

నా నడుముని చుట్టుకుని వెక్కివెక్కి ఏడ్చాడు. ఆ వెక్కిళ్ళ లోనే కొత్త అమ్మ వచ్చాక నాన్న కొట్టటం ఎక్కువ చేశాడనీ, మాటి మాటికీ టౌనులో వున్న సీమ దొరసాని యింట్లో నౌకరుగా బతకమనీ తిట్టేవాడనీ చెప్పాడు. స్కూల్లో చేర్తానంటే చేర్చలేదనీ, తనే టీచర్‌ని బతిమాలి చేరితే, ఒక్కరోజుకూడా స్కూలుకి టైమ్‌కి వెళ్ళనివ్వలేదని....అందుకని టీచర్ స్కూల్లోంచి తీసేశాడనీ చెప్పాడు.

"దొరసానీ.... నేను మీ దగ్గర ఏ పనైనా చేస్తాను. కానీ నన్ను రోజూ స్కూలుకి పంపండి. పొద్దున స్కూలుకి వెళ్ళేదాకా పని చేస్తాను సాయంకాలం పనయ్యాక చదువుకుంటాను" అన్నాడు ఆశగా నా కళ్ళల్లోకి చూస్తూ.

వాడి మాటలు వింటూంటే నాకు వువ్వెత్తుగా దుఃఖం వచ్చింది. మురళి శర్మ మొదటి భార్యకొడుకు. రెండేళ్ళవాడిగా వున్నప్పుడు తల్లి చనిపోయిందిట. శర్మ పెట్టే కష్టాలు భరించలేక ఆత్మహత్య చేసుకుందని శర్మకి తెలిసినవాళ్ళు కొందరు నాతో అన్నారు. అప్పుడు నేనది పట్టించుకోలేదు. ఇప్పుడాలోచిస్తే అందులో ఏం అనుమానం లేదనిపిస్తోంది.

మురళి మాతో పదిరోజులు కూడా వుండలేదు. రెండేళ్ళ క్రితం శర్మ ఒకసారి వాణ్నిక్కడికి తెచ్చి, రెండురోజుల్లో మళ్ళీ వాణ్ని వూరు తీసికెళ్ళాడు. మురళినైతే చూశానుకానీ వాణ్ని గురించి నాకేం తెలీదు. నా వర్కులో, ఇంటి చికాకుల్లో మర్చేపోయాను.

మనిషిని మనిషిగా చూడలేని శర్మలోని అర్థంలేని అహంకారం కన్నబిడ్డని మాత్రం ప్రేమగా చూడగలుగుతుంది. కొడుకులో వికసిస్తున్న స్వతంత్రభావాల్ని శర్మ భరించలేకపోయాడు! నేనేం మాట్లాడకుండా ఆలోచిస్తూండేసరికి, మురళి దూరంగా జరిగి, కళ్ళూ ముక్కూ చొక్కాఅంచుతో తుడుచుకుంటూ నా వంక అభిమానంగా చూస్తూ నిల్చున్నాడు.

"మురళీ నువ్వెక్కడికీ పోవద్దు.... నువ్వేం పని చెయ్యక్కర్లేదు. నీకు పనులు చెయ్యటానికి, స్కూలుకి తీసుకెళ్ళటానికి నౌకర్ని పెట్తాను. స్కూలుకి పొయ్యేదాకా, స్కూలునించి వచ్చిం తర్వాత అక్కడి కబుర్లూ, లెసన్సూ అన్నీ నువ్వు నాకు చెప్పాలి."

"నిజం దొరసానీ!"

"నేను దొరసానినని నీ కెవరు చెప్పారు? లేక నీకలా కనిపిస్తున్నానా?"

"మా నాన్నా, పెదనాన్నలూ, పెద్దమ్మలూ అందరూ నిన్నలాగే అంటారు. కానీ నాకు మాత్రం నువ్వు మా అమ్మలాగా

కనిపిస్తున్నావ్. తల్లితోడు....కావాలంటే ఇదుగో....” గబుక్కున సంచీ బోర్లించాడు. రెండుమూడు మాసినబట్టల మధ్యనించి ఒక గ్లాస్‌ఫ్రేమ్‌లేని ఫోటో కిందపడింది. ప్రశాంతమైన మొహంతో, తెలివైన కళ్ళతో ఒక స్త్రీ. శర్మ మొదటిభార్య....తదేకంగా చూస్తున్నాను. “నేను చెప్పింది నిజంకాదా” నా బుజాలు కదిలించాడు మురళి. “నువ్వు కూడా మా అమ్మలాగా పెద్దబొట్టు పెట్టుకున్నావు. చిన్నముడి వేసుకున్నావు .... వుహు....అదేంకాదు.... అందులో అమ్మ చూస్తున్నట్టే నా వంక నవ్వుతూ చూస్తున్నావు. ఎవ్వరూ నన్నలా చూడరు. కానీ అమ్మ మాత్రం....రాత్రులు నాకు నిద్దరపట్టక అమ్మ ఫోటో చూస్తే, ఆశ్చర్యం! అంత రాత్రిలో కూడా అమ్మ నవ్వుతూనే వుంటుంది. ఈ ఫోటో....” గొంతు తగ్గించి అటూ యిటూ చూశాడు. “వాళ్ళకి తెలీకుండా దొంగతనంగా తెచ్చాను.”

“మీ అమ్మఫోటో నువ్వు తెచ్చుకోవటం దొంగతనం ఎలా అవుతుంది? ఇంతకీ యిక్కడికి వస్తున్నట్టు యింట్లో చెప్పావా లేదా?”

వాడు తలొంచుకున్నాడు. మురళి కళ్ళలోకి పరిశీలనగా చూశాను. పదేళ్ళు నిండిన ఆ పసివాడు చెప్పిన మాటలు....ఎవరూ నేర్పించినవి కావు. వాడికి వాడే చెప్పినవి. అని తేలిపోయింది. వాడి కళ్ళల్లో నేనింకోటి చూశాను. ఆత్మాభిమానం! వాడు నన్ను అర్థిస్తున్నట్టులేవు వాడి చూపులు—అభిమానంతో సమానస్తులతో మాట్టాడినట్టున్నాయి వాడి మాటలు. ఈ పిల్లాడికి చిన్నఆధారం దొరికితే చాలు, చక్కటి సంస్కారంవున్న మనిషవుతాడు....అనిపించింది నాకు.

“అలా రావటం తప్పా అమ్మా? నేనేం చెయ్యాలి? నేను మాట వినటంలేదని పెదనాన్న పొలంలో ఈ రోజునించే పనికి పెట్టానని నాన్న పిన్నితో అనటం విన్నాను. అంతే నేనెలా స్టేషన్‌కి వచ్చానో నాకు తెలీదమ్మా. నిద్రపోతుంటే రైలాగిపోయిందని ఎవరో లేపారు. ఒకాయనకి నీ అడ్రస్....ఇదిగో కార్డు చూపించాను ఒక ముసిలాయన, ఈ వీధిలోనే వుంటాడట? తనతోపాటు రిక్షాలో

ఎక్కించుకుని నన్ను దింపి వెళ్ళాడు" మురళి చెప్తున్నాడు.

నా గురించి ఏం తెలీనివాడు, నా మీద ఏ నమ్మకంతో, ఆ పదేళ్ళు నిండని పసివాడు....ఎంత సాహసంచేసి వచ్చాడు! నాకు ఏదో తెలీని అభిమానంతో కళ్ళనీళ్ళు వచ్చాయి. "పోనీలే ఎలాగైతేనేం తప్పిపోకుండా ఇల్లు చేరావు" నా మొహం కనపడకుండా అటు తిరిగి "రా స్నానం చేద్దువుగాని."

చొక్కా విప్పగానే వాడి వీపుమీద తేలిపున్న వాతలు కనిపించాయి. పసివాణ్ని పశువులాగా కొట్టారు. ఎముకలు-చర్మమూ తప్ప మురళి ఒంట్లో ఫ్లెష్ కనిపించలేదు. వాడి మనస్తత్వానికీ, నా పద్ధతులకీ కలవకపోతే అంతగా ఐతే హాస్టల్లో పెట్టి చదివిస్తాను కానీ పిల్లవాడ్ని మాత్రం శర్మ వచ్చి ఎంత గోలచేసినా పంపించను. వీడి కారణంగా శర్మ ఎక్కువగా రాకుండా చేస్తాను అనుకున్నాను.

మురళిలో ఎంత చురుకుదనం వుంది! ఎంత పరిశీలనాశక్తి వుంది! ఎంత సెన్సిటివ్‌నెస్ వుంది! ఎంత ఇంటలిజెన్స్ వుంది! ఇంత పసితనంలో కూడా ఎంత పెద్దమనిషితరహా వుంది। ఈ గుణాలతోపాటు వాడి బూరెబుగ్గలూ, తెలివైన కళ్ళూ, వుంగరాల జుట్టూ, మృదువైన గొంతూ-నన్ను ఆకర్షించాయ్. వాడిని చూస్తూంటే తాతయ్య దగ్గర వుండిన లార్డ్‌కృష్ణా తైలవర్ణచిత్రం, రవివర్మ వేసినది జ్ఞాపకమొచ్చేది.

తన పనికి నౌకర్లు అవసరం లేదని, స్నానం చేయించటం అలాటివి పేరేవాళ్ళతో చేయించుకోటం తప్పని, పనులు తనే చేసుకోటం తనకిష్టమని చెప్పాడు. కారులో స్కూలుకి వెళ్ళమన్నాను మురళిని.

"అందరూ నడిచివస్తారమ్మా, ఎవరో ఒకరిద్దరు కార్లలో వస్తారు. నాకు సరదాగా ఫ్రెండ్స్‌తో నడిచివెళ్ళటం ఇష్టం. నేనొక్కణ్నే ఎందుకు ప్రత్యేకంగా వెళ్ళటం!"

"మనకు కారుంది కదా మురళీ. ఎందుకు అనవసరంగా నడవడం?" స్కూలు ఎక్కువ దూరంలేదు. అయినా వాడేమంటాడో వినాలని అడిగాను.

"నువ్వంటావ్ అమ్మా లార్డ్‌కృష్ణా అని. ఆయనకి ఏం తక్కువ? గొల్లవాళ్ళతో కలిసి బతికాడు, తిన్నాడు, తిరిగాడు.... ఆఖరికి పశువులను కూడా కాచాడు. చిన్నతనంలోనే ఎన్ని గొప్ప పనులు చేశాడు? ఆయనే కదా ఆఖరికి అంత గొప్ప భగవద్గీత చెప్పాడు. గొప్పతనం మనసుల్లో వుంటుంది కానీ ఆడంబరాల్లో రాదుట."

"ఇవన్నీ నీకెవరు చెప్పారు మురళీ?" ఆశ్చర్యంగా అడిగాను.

"మా పెద్దమ్మకి తోడుగా రాత్రులు గుడికెళ్ళే వాణ్ని. అక్కడ చెప్తూంటే విన్నాను" మురళీ అచ్చం మా తాతయ్యలాగా లార్డ్‌కృష్ణా గురించి కథలు చెప్పేవాడు.

పదిహేను రోజుల్లో విడదీయలేని ఆత్మీయులమయ్యాము. ఇన్ని రోజులనించీ వాణ్ని దూరంగా వుంచి, నేనెంత కోల్పోయానో నాకర్థమైంది. మురళి హుషారుగా ఇంట్లో తిరుగుతూంటే ఐదేళ్ళనించీ లేని నిండుతనం నా యింట్లో నిండినట్టు తోచింది. శర్మకీ మురళికీ ఎంత తేడా! మేడిపండులాంటి శర్మ రంగు ఒక్కటి మాత్రం మురళికి. మంచి క్రమశిక్షణలో, సివిలైజేషన్ పెరిగితే వాడు భారతీయులకే గర్వకారణంగా తయారవుతాడు — శర్మ దగ్గిర వుండుంటే పిచ్చివాడయ్యేవాడు, లేకుంటే మరో 'శర్మ'గా తయారయ్యేవాడు. నా దగ్గిరికి చేర్చిన వాడి కష్టాలకి మనస్ఫూర్తిగా ధన్యవాదాలు చెప్పుకున్నాను.

పొద్దున మేమిద్దరం బిజీగా వుంటాము. టిఫిన్ తినేప్పుడు ఒక్క అరగంట డైనింగ్‌టేబిల్ దగ్గిర కల్సుకుంటాము. మురళికి సెన్స్ ఆఫ్ హ్యూమర్ కూడా ఎక్కువ. ఏదో చెప్పి నవ్వుతూంటాడు నవ్విస్తాడు. నాతో ఇంగ్లీషులోనే మాట్లాడ్డానికి ప్రయత్నించేవాడు. మధ్యాహ్నం వాడి భోజనం స్కూల్లోనే. సాయంకాలం నేను వచ్చేసరికి ఆడుకుని, స్నానం చేసివుంటాడు. కొన్ని లెసెన్స్ చెప్తాను. కానీ నాకు రోజూ వీలయ్యేదికాదు. నేనెంత పొద్దుపోయి వచ్చినా, నా కోసం మేలుకొని కూచునేవాడు. ఆ గంటా లెసెన్స్ కంటే,

వాడితో సరదాగా కబుర్లు చెప్పటం నా కిష్టం. ప్రైవేట్ టీచర్‌ని పెట్టాను. ఇంగ్లీషులో చక్కటి పిల్లల లైబ్రరీ తెప్పించాను. స్కూల్లో స్పోర్ట్సులో అన్నింటిలో చేర్పించాను. పొద్దున ఆసనాలూ, సాయింకాలం ఎక్సర్‌సైజూ చేసేవాడు—రెండునెలలు గడిచేసరికి మురళి ఇంకా చక్కగా, బాగా ఆరోగ్యంగా తయారయ్యాడు.

అప్పుడే హాస్పిటల్‌నుంచి వచ్చి అద్దం ముందు నిల్చుని జుట్టు విప్పుకుంటున్నాను.

"మురళిని ఏంచేశావ్?" వెనకనించి వురిమినట్టు మాటలు. తలుపుకి ఆనుకుని నించున్న శర్మ కనిపించాడు అద్దంలోంచి.

"ఏ మురళి?" అటు తిరిగాను.

"ఏ మురళి! అవునులే.... మొగుడంటేనే లెక్కలేని వాళ్ళకి వాడి పిల్లలేం గుర్తుంటారు?"

శర్మకేసి తీవ్రంగా చూశాను. "ఇప్పుడు ఎవరూ ఎవరికీ ఏం కారు. ఇక్కడ మాట్లాడేదేంలేదు. వెళ్ళి హాల్లో కూచోండి. నా విజిటర్స్‌ని ఎవర్నయినా హాల్లో కల్సుకుంటాను." అన్నాను కఠినంగా. శర్మ మెల్లిగా బైటికి వెళ్ళాడు.

నేను హాల్లోకి వెళ్ళేసరికి 'మామూలుగా' శర్మ మూడ్ మారింది. వూరికినే నవ్వులు, వినయం....

"మురళీ ఇక్కడికి వచ్చాడని తెలిసింది. (రెండు నెలల తర్వాత!) ఒంటరిదానివి. బోలెడంత సంపాయిస్తున్నావ్—పోనీలే నీ దగ్గరైతే వాడు భయంగా వుంటాడు—చదువుకూడా వస్తుంది—నేనే పంపిద్దామనుకున్నాను. ఇంతలో తొందరపడి వచ్చాడు. వాడికి వూరికే తిండి పెట్టక్కర్లేదు. కారు తుడవటం, చెట్లకి నీళ్ళు పొయ్యటం అలాంటివి....అలాంటివేం ఏదైనా చేస్తాడు. చూడటానికి అలా కనిపిస్తాడు కానీ గాడిద చాకిరీ చెయ్యగలడు....ఊ....వాడి ప్రాబ్లమ్ తీరిపోయింది....కృష్ణా నీదెలాగైనా మెత్తటి మనసు. పది వేల రూపాయలతో ప్రెస్‌పని పూర్తికాలేదు. ఇంక పదివేల రూపాయలు ఖర్చు వుంది. అది ఇచ్చావంటే పూర్తవతుంది....ఇంక అడగను...." అన్నాడు ప్రాధేయపడుతూ.

నా కెంతో ఆశ్చర్యమేసింది. అతను డబ్బు అడిగినందుకు కాదు — కొడుకుని గురించి చెప్పిన మాటలకి. నా దగ్గిర నౌకరుగా పెట్టుకోమన్నందుకు! అతను ఎదురుగా వుండటం నేనింక భరించలేక పోయాను.

"మురళిని నీ కొడుకుగా చేరనియ్యలేదు. చదువుమీద ఆసక్తి వున్న కుర్రవాడిగా, అనాధగా చేరదీశాను. నేనెన్నో అనాధాశ్రమాలకి చారిటీలు ఇచ్చాను. దయచేసి వాణ్నిగురించి పట్టించుకోవద్దు. స్కూలు నుంచి వస్తూంటాడు. చూస్తావా?"

"అహ.... ఒద్దు. ఏం అవసరంలేదు—డబ్బిస్తే, గంటసేపట్లో ట్రైన్ వుంది. వెళ్ళిపోతాను."

డబ్బు తేవటానికి బెడ్‌రూంలోకి వెళ్ళాను. మంచంకింద చప్పుడైంది. వంగి చూశాను. మురళి! మొహంనిండా చెమట పట్టి వుంది—భయంగా చూస్తున్నాడు.

"అరె—మురళీ స్కూల్‌నించి ఎప్పుడొచ్చావ్? అక్కడ కూచున్నావేం?"

"అమ్మా నన్ను పంపించకు....మళ్ళీ నా చదువు కాస్తా మాన్పించేస్తారు" అన్నాడు మంచం కిందినుంచే ఏడుపుగొంతులో.

"నిన్నెక్కడికీ పంపించను. బైటికిరా. స్నానంచేసి, నాయర్ టిఫిన్ ఇస్తాడు. తిని ఆడుకో."

శర్మకి డబ్బిచ్చి పంపేశాను.

## 5

మురళీ ప్రతీ క్లాస్ ఫస్ట్ రాంక్‌లో పాసయ్యేవాడు. ఎక్సర్‌సైజూ, గేమ్స్, రెగ్యులర్ హేబిట్స్‌తో బలంగా, ఆరోగ్యంగా తయారయ్యాడు. పదహారేళ్ళ మురళీ, ఇరవైయ్యేళ్ళ యువకుడిలా కనిపించేవాడు. వాడు ఎంతవాడైనా నాకు పసివాడే. మెడిసిన్‌లో సీటు వచ్చింది మురళికి. ప్రతీ ఇయర్ ఫస్ట్ రాంక్‌లో పాసయ్యాడు. చదువంతా దాదాపు స్కాలర్‌షిప్స్‌మీదే. హౌస్‌సర్జన్‌కి వచ్చాడు. ఆ ఆ రోజు పార్టీ ఇచ్చాము. వాడి ప్రొఫెసర్స్, ఫ్రెండ్స్ నన్నెంతో

గౌరవించారు. అలాంటి కొడుకుండటం నా అదృష్టమని పొగిడారు. విదేశాలకి M.D. చెయ్యటానికి పంపమని చెప్పారు. ఇన్ని రోజులుగా నాకు నేనుగా గౌరవింపబడుతున్నా, అందరితో మురళీ "మా అమ్మ మా అమ్మ" అంటూ చెప్తూంటే, పరిచయం చేస్తూంటే ఇంతకు ముందెప్పుడూ కలగని కొత్త అనుభూతితో, ఆనందంతో నా మనసు నిండిపోయింది. మురళిని నేను కనలేదు. ఆ కనలేదన్న సంగతి ఎప్పుడో మర్చిపోయాను. అది అప్పుడప్పుడూ జ్ఞాపకం వచ్చేది. కానీ నిన్నటితో ఆ జ్ఞాపకంకూడా పోయి, "మురళీ నా బిడ్డ" అనే పూర్తి నమ్మకం ఏర్పడింది. ఆ రోజు రాత్రి మురళీ భవిష్యత్తు గురించి బంగారు కలలతో నిద్రపోయాను.

తెల్లవారేసరికి శర్మ వచ్చాడు. ఈ పన్నెండేళ్ళలో శర్మ చాలా సార్లు వచ్చాడు. అతను వచ్చినప్పుడు సాధారణంగా మురళి ఇంట్లో వుండేవాడు కాదు. ఒక్కోసారి వున్నా, ఎక్కువ మాట్టాడకుండా' అడిగినవాటికి జవాబు చెప్పి వెళ్ళిపొయ్యేవాడు—శర్మ నా దగ్గిరికి డబ్బుగురించి రావటం మురళికి ఇష్టం వుండేదికాదు. నాకూ ఈమధ్య సిటీలో డాక్టర్స్ కాంపిటీషన్ ఎక్కువైంది. శర్మ వచ్చినప్పుడల్లా డబ్బు అవసరంతోనే వచ్చేవాడు. మాటల్లో చెప్పాడు. భార్యకి ఐదు కాన్పులయ్యాయి, ముగ్గురు పిల్లలు, ఆడపిల్లలు బతికారని. శర్మకి పుట్టిన ఆ బిడ్డలు ఎంత దురదృష్టవంతులు! వాళ్ళని తలుచుకుంటే బాధేస్తుంది. శర్మకి నేను డబ్బిచ్చినంతకాలం ఇలాగే తన ఫామిలీ తను పోషించుకోడు. నామీదే ఆధారపడి వుంటాడు. ఇప్పుడైనా శర్మకి తెలిసిరావాలి. శర్మ డబ్బు అడిగితే ఇవ్వకూడదని నిర్ణయించు కున్నాను.

"మురళీకి హౌస్ సర్జన్ అయిందిటగా. ఇంక వాడిని తీసికెళ్దా మని వచ్చాను. అయినా నా కొడుకుని నేను తీసికెళ్ళటానికి నిన్నడిగే దేమిటి? పోనీ పెంచావుకదాని చెప్తున్నా...." ఏంలేకున్నా మాటల్లో అహంకారం!

రాత్రి నా సంతోషంలో 'శర్మ' అనే ఒకడున్నాడని, అతను మురళిని 'కన్నతండ్రని' మరిచేపోయాను! మురళీని పంపించవలసి

వస్తుందని నేనెప్పుడూ వూహించలేదు. నాతోపాటు హాస్పిటల్ బాధ్యత తీసుకుంటాడని, మురళీకి పూర్తిగా బాధ్యత అప్పగించి, వాడికి అసిస్ట్‌చేస్తూ వుందామని అనుకున్నాను. కానీ ఈ విధంగా శర్మ వచ్చి అడగటం....మురళీ ఏమంటాడో. మనసులో వాడికి మాత్రం తండ్రంటే ప్రేమ వుండదా? నేను పుట్టుకతో యూరోపియన్‌ని. మా యూరోపియన్స్‌లో పిల్లలకి పదహారు ఏళ్ళు వచ్చేదాక తల్లిదండ్రుల బాధ్యత. తర్వాత వాళ్ళు స్వతంత్రంగా బతుకుతారు—అలాంటి కమ్యూనిటీలో పుట్టిన నేను, 'కనని' బిడ్డని జీవితాంతం నా దగ్గిరే పెట్టుకోవాలని ఆలోచించాను. వాడినుండి ప్రతిఫలం ఆశించాను. ఎంత పొరపాటు! చిన్నప్పుడు తాతయ్య చెప్పిన భగవద్గీత, నేను రోజూ చదివే భగవద్గీతలోని ఒక వాక్యం జ్ఞాపకం వచ్చింది—

"అర్జునా, ప్రతిఫలాపేక్షలేకుండా నీ కర్తవ్యం నీవు చెయ్యి." ఐనా మనిషి మనసు చంచలమైంది. అది ప్రేమకీ, బంధానికీ లొంగి పోతుంది—

"మురళీ ఇక్కడ హాస్పిటల్ చూచుకోవాలి. నాకీమధ్య హెల్త్ బాగుండటం లేదు—వాడు హాస్పిటల్ చూసుకుంటే, నేను మెటర్నటీ హోమ్‌కి మాత్రం అటెండ్ అవుదామనుకుంటున్నాను" అన్నాను.

"ఊఁ....వాడిప్పుడు నీకు కావాలి. చూశావా నాతో ఎంత అవసరం వచ్చిందో నీకు...." శర్మ వ్యంగ్యంగా నవ్వాడు .... "నేను ఇక్కడే వుండుండే ఈ పరిస్థితి వచ్చేదికాదు. ఇంకా మనకి పిల్లలు పుట్టేవాళ్ళు....పాపం, ఎన్ని వుంటే ఏం లాభం? నీకుగా, సిదిగా ఒక్క బిడ్డ లేదు...."

బిడ్డలున్నారని ఎందుకు గర్వం శర్మకి! వున్న ఒక్క కొడుకుతో పడక పెంచలేక నా దగ్గిర వదిలేశాడు. మిగిలిన బిడ్డల్ని నామీద ఆధారపడి పెంచుతున్నాడు. అయినా ఎంత అహంకారం!

"ఇన్నేళ్ళూ వాడి బాధ్యత నీకు పట్టలేదు. ఇవాళ వాడు సంపాదించే స్థితికి వచ్చేసరికి హక్కుగా వచ్చి అడుగుతున్నావు. కనకపోయినా మురళీ నా బిడ్డ—కనలేదన్న అసంతృప్తి నాకేంలేదు.

నన్ను వదలి మురళీ ఎక్కడికీ పోడు" అన్నాను.

"నీకెందుకు వాడి అవసరమో తెలిసింది. నువ్వేధైర్యంతో ఈ మాట అంటున్నానో నా కర్థమైంది. నువ్వు నీమ దొరసానివి— నీకు నీతిలేదు, జాతిలేదు. వరసలేదూ—వయసులేదు—వాడేమో ఎర్రగా బుర్రగా తయారయ్యాడు—వాడిని వలలో వేసుకునీ...."

"శర్మా" లేచి నించున్నాను. కోపంతో, అసహ్యంతో నా ఒళ్ళు ఒణికింది. "ఏ జన్మలోనో నేను చేసిన పాపంవల్ల కొన్ని రోజులు భర్తగా నిన్ను చూశాను. ఐ రిగ్రెట్ ఇట్ ఫార్ ఎవర్.... ఇంత నీచంగా వూహించగలవని ఇప్పుడే నాకు తెలిసింది...." ఇంక అతనితో మాట్లాడటానికి నాకు మనస్కరించలేదు.

"అమ్మా" మురళీ వచ్చి నన్ను పట్టుకున్నాడు. "ఈయన వచ్చినప్పట్నించీ అంతా వింటున్నాను. ఇతను నా తండ్రని చెప్పుకోటానికేకాదు అనుకోటానికే సిగ్గుపడ్తున్నాను. ఇలాంటివాడికి అడిగినప్పుడల్లా వేలువేలు డబ్బిచ్చి పాముకు పాలుపోసి పెంచావమ్మా. ఇదుగోండి శర్మగారూ-ఏదైనా ప్రచారం చేసుకోండి-నాకేం భయం లేదు. మా అమ్మకేం తక్కువకాదు. ఏరోజైతే ఆ యింటినించి అమ్మదగ్గిరికి వచ్చానో ఆరోజే మీతో నాకున్న బంధుత్వం తెగిపోయింది. కన్నావు కాబట్టి, ప్రతినెలా నా సంపాదనలో కొంత పంపుతాను-అంతే....వూ....అన్నిటికంటే ముఖ్యం. మీకూ-నాకూ ఆ మాత్రమైనా సంబంధం మధ్య వుండాలంటే ముందు మా అమ్మకి క్షమాపణ చెప్పుకోండి....ఊ...."

ప్రశాంతంగా, స్వచ్ఛంగా వున్న మురళీ మొహం చూసి శర్మ భయపడ్డాడు-స్థిరంగా, గంభీరంగా అన్న వాడి మాటలు విని పశ్చాత్తాప పడ్డాడు.

"బాబూ నువ్వు నన్ను అపార్థం చేసుకున్నావ్. నువ్వు నాకు దక్కవనే ఆవేదనతో అన్నానే కానీ. కృష్ణగురించి నాకు తెలీదా. నన్ను క్షమించి నీ చెల్లెళ్లనీ, పినతల్లినీ కొంచెం కనిపెట్టి వుండు. కృష్ణా నన్ను క్షమించు-నేను పూర్తిగా ఓడిపోయాను. దిక్కులేని నా భార్యా, పిల్లల్ని అప్పుడప్పుడూ చూసేందుకు వాడికి అనుమతి

ఇవ్వు. నువ్వన్నట్టు నువ్వు కనకపోయినా, మురళీ నీ బిడ్డే" అతని కళ్ళల్లో నీళ్ళు నిండాయి.

"ఒద్దు. నాకు క్షమాపణలు అవసరంలేదు. ఇప్పటికైనా మురళి మీతో కలిసి వుంటానంటే నాకేం అభ్యంతరంలేదు. ఈ హాస్పిటల్ బాధ్యత వాడికి వదిలేసి, నేనేదైనా ఆశ్రమంపోతాను. మీరు మీ పిల్లలతో ఇక్కడికే వచ్చివుండండి."

"వీల్లేదమ్మా. నువ్వెక్కడికీ వెళ్ళటానికి వీల్లేదు. ఇది నీవు ఇప్పటి కిప్పుడు తీసుకున్న నిర్ణయం. నువ్వు లేకుండా ఇంత పెద్ద హాస్పిటల్ నేను మానేజ్ చెయ్యలేను. నీ గైడెన్స్ నాకు కొంత కాలం కావాలి. అప్పుడు నేనే నిన్ను ఆశ్రమంలో చేర్పిస్తాను. ఈయన ఇప్పుడు రాకుంటే నీకు నన్ను నిజంగా వదిలేసి వెళ్ళాలని వుండిందా అమ్మా మనసుకి వ్యతిరేకంగా ఏదీ చెయ్యగూడదని నువ్వేగా అమ్మా చెప్పావు. ఆయన్నీ, నన్నూగురించి నీ పద్ధతులూ, అభిప్రాయాలు మార్చుకోటానికి వీల్లేదు-మేము కేవలం నీ ఇంటికి ఆశ్రయానికి వచ్చిన వాళ్ళం. నాన్నా, నేను నీకు సాయం చేస్తాను. కానీ పూర్తిగా నామీద ఆధారపడవద్దు. నువ్వున్నంతకాలం నీ పిల్లల్ని పోషించటానికి బాధ్యతతో ప్రయత్నించు-అలా నిజంగా ప్రయత్నం చేస్తే వేరే వాళ్ళమీద ఆధారపడాల్సిన అవసరంరాదు___" అన్నాడు మురళి.

శర్మ ఆరోజు మురళీతో కలిసి భోంచేశాడు. వెళ్ళేదాకా ఏదో ఆలోచిస్తూ, ఏం మాట్లాడలేదు. నన్ను డబ్బు అడగలేదు; మురళికి జాగ్రత్తలు చెప్పలేదు. వెళ్తున్న శర్మని చూస్తూంటే ఎందుకో అతను మళ్ళీ రాడేమోననిపించింది. రెండోరోజు టెలిగ్రామ్ వచ్చింది-శర్మ ఆత్మహత్య చేసుకున్నాడు. అక్కడికి మురళి వెళ్ళి వచ్చాడు. మురళిని అక్కడ ఏం ముట్టుకోనివ్వలేదట. కిరస్తానీ దానితో వుండి జాతిభ్రష్టుడివైనావని తిట్టారుట. డబ్బు ఇవ్వనందుకు శర్మ ఆత్మహత్య చేసుకున్నాడని నిందించారట. శర్మ భార్యతో, పిల్లలతో వాళ్ళకేం సంబంధంలేదని, మురళిని తీసికెళ్ళమని చెప్పారుట. మురళి-డబ్బు పంపుతానని, ఆడపిల్లలకి పెళ్ళిచేస్తానని శర్మ

భార్యకి చెప్పి వచ్చాడు.

ఈ ఏర్పాటు నాకు నచ్చలేదు. డబ్బు పంపినా అది ఆమెకి నేరుగా అందుతుందని ఏం నమ్మకంలేదు. మురళిని పంపి వాళ్ళని పిలిపించాను. నా బంగళాలో ఒక గదిలో ఆమె, ఆమె పిల్లలూ వుంటున్నారు. ప్రెస్ అమ్మిన డబ్బుతో అప్పులుపోగా, మిగిలిన డబ్బుతో పెద్దపిల్ల పెళ్ళిచేసి పంపాడు మురళి. మిగిలిన ఇద్దరు పిల్లల్నీ స్కూల్లో చేర్చాడు-పసిపిల్లలు వాళ్ళకేం తెలుసు? తండ్రి అసమర్థతకి వాళ్ళ జీవితాలు పాడైపోకూడదు....కొత్త బాధ్యతలు చాలా సహజంగా స్వీకరించాడు మురళి. మురళి అమెరికా వెళ్ళటానికి పాస్‌పోర్టుకోసం ఎదురుచూస్తున్నాడు. హాస్పిటల్లో డాక్టర్‌గా అపాయింట్ అయ్యాడు. జీవితంలో ఇన్ని మార్పులు జరిగినా, కాలంలో ఏం మార్పులేదు—మామూలుగా రాత్రి, పగలు జరిగిపోతున్నాయి.

ఆరోజు ఒక డెలివరీ కేస్ చేశాను. అది ఆ అమ్మాయికి మొదటి కాన్పు. పిల్లకి పధ్నాలుగేళ్లుండొచ్చు. ప్రిమెచ్యూర్ డెలివరీ. ఇంత పసిపిల్లకి అప్పుడే పిల్లలు! ఇండియాలో ఇంకా కొన్ని పార్ట్స్ మారలేదు. అడ్మిట్ చేసేటప్పుడు ఆ అమ్మాయి పెద్దనాన్న వచ్చాడు.

"పేరెంట్స్ ఏరీ" అని అడిగాను.

"తల్లి ఇక్కడే వుంది—ఏడుస్తూ బైట కూచుని వుంది. తండ్రికి టెలిగ్రామ్ ఇచ్చాము" అన్నాడు.

డెలివరీ మామూలుగా కాలేదు. ఆపరేషన్‌చేసి బిడ్డనితీశాను. ఇలాంటివి నా కెరీర్‌లో నా కెన్నో ఎదురైనా ప్రతీసారి తల్లీ బిడ్డా క్షేమంగా వేరయ్యేదాకా, నాకు మనసు మనసులో వుండదు. నా ఫస్ట్ కేస్ వచ్చి నా తల్లో దూరి నన్ను గుచ్చుతూ వుంటుంది. పైకి ధైర్యంగా కనిపించినా, కేసు సక్సెస్ అయ్యేదాకా లోలోపల ఏదో ఆందోళన, భయం కలుగుతుంటాయి, నా సొంత బిడ్డ ప్రమాదంలో వున్నట్టు. అది ఎలా తప్పించటమా అనే పిచ్చి తపన మొదలవుతుంది. 'ఐయామ్ టూ సెన్సిటివ్ టు డు ఎ డాక్టర్స్ జాబ్' అని

పిస్తుంది ఆ నిమిషంలో.

కేసు సక్సెస్ అయింది. మూడోరోజు రౌండ్స్‌కి వెళ్ళినప్పుడు ఆ అమ్మాయి తల్లి కాబోలు బెడ్ దగ్గిర కూచునివుంది. నన్ను చూసి ఆమె లేచి నిల్చుంది. నమస్కారం చేసింది. "మీ చేతి చలవవల్ల నా బిడ్డ దక్కింది" అని కళ్ళ నీళ్ళతో అంది. ఆమెని ఎక్కడో చూసినట్టు అనిపించింది. ఇంతలో ఆ అమ్మాయి తండ్రి వచ్చాడు. వెంటనే గుర్తుపట్టాను. అవధాని! అతనూ నవ్వుతూ నాకు నమస్కారం చేశాడు. "మీ పేరు చూడగానే మీరే అనుకున్నాను. దాదాపు ఇరవైయ్యేళ్ళ తర్వాత ఎంత విచిత్రంగా కలుసుకున్నాము." భార్యవైపు తిరిగి "ఈమె ఎవరో గుర్తుపట్టావా? శర్మతో ఒక సీమ దొరసానమ్మ మనవూరు రాలేదూ....పోశేరమ్మ జాతర జరుగుతున్నప్పుడు....మన పెద్దవాడికి జబ్బుచేసింది. ఈమేగా ఆ రాత్రి రాజమండ్రికి తీసికెళ్ళింది మనల్ని...." భార్యకి గుర్తు చేశాడు. అబ్బ....శర్మ చెప్పకపోయినా, అప్పుడు గడిచిన ప్రతి నిమిషం....బండి ఎక్కిన దగ్గిర్నుంచీ. మళ్ళీ నేను రైలెక్కేదాకా నాకెంత గుర్తు. అదేజ్ఞాపకం....నా విక్టరీలో__ఫైల్యూర్‌లో. నా దైలమాలో నన్ను గుచ్చే....అది ఈ జన్మలో చెరిగిపోదు. నేను మొన్న మృత్యువుతో పోరాడిన డెలివరీ కేసు అవధాని కూతురు ... అని ముందే తెలిసుంటే....ఇంకా ఎంత నెర్వస్‌గా అయ్యేదాన్నో! థాంక్‌గాడ్. వాళ్ళ బిడ్డని కాపాడే బలం ఇచ్చావ్. కొంచెంసేపు అక్కడవుండి, హాస్పిటల్ నా అసిస్టెంటుకి వదిలేసి, ఇంటికి వచ్చేశాను__

పడుకుంటే నిద్దర పట్టలేదు. మనసులో ఏదో ఆందోళన, ఏమిటో చెరగని జ్ఞాపకం....నేనేం సాధించాను? అనే ప్రశ్న నన్ను కలవరపెట్తోంది. బుక్ షెల్ఫ్ తీశాను. నేనెప్పుడో మొన్న సగం చదివిపెట్టిన మామ్‌రాసిన 'ఆఫ్ హ్యూమన్ బాండేజ్' నవల కనిపించింది ఎదురుగా. ఈ నవల లెక్కలేనన్నిసార్లు చదివాను. అందులో ఫిలిప్స్....చిన్నప్పుడు తన క్లబ్‌ఫుట్ గురించి, టీనేజ్‌లో ఆర్ట్ ఫైల్యూర్ గురించి, యౌవ్వనంలో తన ఫైల్ అయిన లవ్ ఎఫైర్

గురించీ....ఇలా వరసగా ఫైల్యూర్స్‌ని గురించి తలచుకుని నిరాశ చెందుతాడు-ఆ నిరాశలోనే నిర్లిప్తమైన జీవితం గడుపుతాడు....రక రకాల మనుషుల జీవితాల్ని చదువుతాడు. చిన్నవయసులోనే వేదాంతి అవుతాడు. చివరికి తనకేమీ చెయ్యాల్సింది మిగలలేదని ప్రపంచ మంతా తిరుగుతూ జీవితం గడిపేద్దామని నిర్ణయించుకుంటాడు. ఆ సమయంలో ఏక్సిడెంటల్‌గా అతనివల్ల ఒక అమ్మాయి ప్రెగ్నెంట్ అవుతుంది. అంతే! తను ముందు వేసుకున్న ఫ్యూచర్ ప్లాన్స్‌నీ, పాస్ట్‌లోని ఫైల్యూర్స్‌నీ మర్చిపోయి, ఆ పుట్టబొయ్యే బిడ్డని తనలాగా అనాథగా, అసంతృప్తిగా బతకనివ్వనని నిశ్చయించు కుని. ఆ అమ్మాయిని స్వీకరిస్తాడు....బిడ్డ భవిష్యత్తు అతని ధ్యేయంగా చేసుకుంటాడు. మనిషియొక్క ప్యాషన్స్‌నీ-ఫైల్యూర్స్‌నీ, ఆశలనీ-అవకాశాల్నీ ఎన్నో కోణాలనించి తరచి రాసిన మామ్ నవల మననం చేసుకుంటూ పడక కుర్చీలో పడుకున్నాను.

"అమ్మా ఇంకా ఆలోచిస్తూనే వున్నావా? ఈ లిస్టు చూడు. పార్టీకి నీ ఫ్రెండ్స్‌ని కూడా పిలవాలిగా....వాళ్ళ పేర్లు చెప్పు. రాస్తాను" మురళి నా కుర్చీ పక్కన కింద కూచున్నాడు. చేతిలో పెన్‌తో, తల వంచుకుని....చిరునవ్వుతో సంతృప్తిగా కూర్చుని వున్న మురళిని చూస్తూంటే....వాడిలో—"జరిగిన దానికి, జరగ బొయ్యేదానికి విచారించకుండా, ప్రతి ఫలాపేక్షలేకుండా కర్తవ్యం చెయ్యటమే.... ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగిపోవటమే ధీరుల లక్షణం" అంటూన్న లార్డ్ కృష్ణా కనిపించాడు.

నా మురళి ఫస్ట్‌కేస్ విజయవంతమైంది. ఇంకా ఏమిటి నాగురించి ఈ ఆలోచన? 'నా' అనే పిచ్చి? నాతరం గడిచిపోయింది. మురళి విజయంలో నా ఓటమి ఎప్పుడో ఓడిపోయింది. మురళీ ఫ్రెండ్స్ వచ్చి, నాకు నమస్కారంచేసి నవ్వుతూ నిల్చున్నారు ఎదురుగా. నా మనసులో ముల్లు తొలగిపోయింది. ***

# మైలపడిన చీర

## (పెద్ద కథ)

### నాయుని కృష్ణమూర్తి

మళ్ళీ ఇంకోమారు గడియారం వంక చూసుకున్నాడు సత్యమూర్తి. పది దాటి పదిహేను నిముషాలయింది.

కాని, ఆ చుట్టుపక్కల యిళ్ళవంక చూస్తే ఏ రెండు గంటలో అయినట్లు అనిపిస్తుంది. సిటీలో కూడా పది గంటలకే రోడ్లు యింత నిర్మానుష్యంగా వుంటాయా అని ఆశ్చర్యంగావుంది సత్యమూర్తికి. బహుశా యీ ఏరియా యిలాంటిదేమో!

తను రాత్రిపూట యీ వైపు బయలుదేరడమే తప్పు. బయలు దేరినా కారు కండిషన్లో వుందా లేదా అని చెక్ చేసుకోకుండా రావడం యింకా పెద్ద తప్పు. మెకానిజం తెలియని డ్రైవర్ని పెట్టుకోవడం....

సత్యమూర్తికి చాలా తప్పులు కనిపిస్తున్నాయి.

మెయిన్ రోడ్డువైపు బయలుదేరి ఏ టాక్సీనో ఆటోనో తీసు కొస్తానని వెళ్ళిన డ్రైవర్ అర్ధగంట గడిచినా యింకా తిరిగి రాక పోవడం అన్నిటికన్నా ఘోరమైన తప్పుగా అనిపిస్తోంది సత్య మూర్తికి. ఏ టాక్సీవాడూ యింతదూరం రానంటే తన గతి ఏం

కావాలి? సత్యమూర్తికి ఆలోచించడానికి భయమేస్తోంది. కనీసం రెండు మూడు మైళ్ళైనా నడిస్తేగాని యిల్లు చేరుకోవడానికి మార్గం దొరకదు. ఇంత రాత్రిపూట సిటీలో అయినా నడవడానికి సత్యమూర్తికి కాస్త భయంగానేవుంది. వేళ్ళకున్న ఉంగరాలు, గడియారము చీకట్లో కూడా మెరుస్తున్నాయి.

తను పొరబాటుచేశాడు. కారు ట్రబుల్ యివ్వగానే డ్రైవర్‌ని యిక్కడే వుంచేసి తను అప్పుడే వెళ్ళిపోయి వుండాలి.

ఈపాటికి యిల్లు చేరి ఎవరైనా మెకానిక్‌ను పంపి వుండేవాడు.

ఇరవై గజాల అవతలున్న వీధిలైటు గుప్పుమని ఒకమారు వెయ్యి కాండిల్ బల్బులా వెలిగి ఆరిపోయింది.

'హతోస్మి!' అనుకుంటూ సత్యమూర్తి కారు వెనకసీట్లో ఒదిగి కూర్చుని సిగరెట్టు వెలిగించాడు.

సిగరెట్టు ఉత్సాహాన్ని పెంచింది.

ఇంటిదగ్గర రాజేశ్వరి ఏంచేస్తూ వుంటుందా అని అటువేపు ఆలోచనల్ని మళ్ళిస్తే తనువున్న స్థితిని కాస్సేపు మరచిపోవచ్చు కదా అని ప్రయత్నించాడు.

మినుకు మినుకు మంటున్న చుక్కలు నెమ్మదిగా అదృశ్యమయ్యాయి. నల్లటి మేఘాలు చూస్తుండగానే దట్టంగా అలుముకున్నాయి. ఒకటి రెండు చినుకులు నేలమీద పడ్డాయి.

సత్యమూర్తికి అగమ్యంగా వుంది.

ఈ వర్షం పెద్దదయితే?

రాత్రికి యిక్కడ జాగారం చెయ్యక తప్పదు. సిగరెట్టు పెట్టెలో ఎన్ని సిగరెట్లు వున్నాయో లెక్కపెట్టాడు. నాలుగు వున్నాయి. అర్ధగంట కొకటి చొప్పున కాలిస్తే యింకో రెండు గంటలు వస్తాయి. ఆ తర్వాత....

దగ్గర్లో ఏదైనా కిళ్ళీకొట్టు కనిపిస్తుందేమోనని చూశాడు.

ఎడంచేతివేపు సందులో దూరంగా ఒక కిరసనాయిల్ బుడ్డి లాంటిది వెలుగుతోంది. సత్యమూర్తిలో ధైర్యం వచ్చింది. ఒకవేళ

రాత్రంతా కాలక్షేపం చేయాల్సి వచ్చినా అక్కడ కొట్లో ఒక పాకెట్టు సిగరెట్లు కొనుక్కొచ్చుకుంటే చాలు!

చినుకులు క్రమంగా పెద్దవవుతున్నాయి.

వర్షం ముదరకముందే ఆ కొట్టు దగ్గరికి వెళ్ళి రావాలి.

కారు తలుపు తెరవబోయి పదిగజాల కవతల ఎవరో వస్తున్నట్టు అనిపించి ఒకక్షణం ఆగాడు సత్యమూర్తి.

జేబులో వందరూపాయల నోట్లు కరకరమంటున్నాయి.

ఆ ఆకారం యింకో రెండడుగులు ముందుకు వేసేసరికి సత్యమూర్తి స్థిమితపడ్డాడు. వస్తున్నది యెవరో స్త్రీ. తను ఆడ వాళ్ళకు భయపడేవాడుకాదు. మగవాళ్ళకు కూడా భయపడడు. కాని జేబులో డబ్బుతో ఒంటరిగా ఉండడంవల్ల కొంచెం జంకు. అంతే!

హఠాత్తుగా పెళపెళమంటూ ఒక ఉరుము ఉరిమింది. ఉరుముతోపాటు ఐదారు క్షణాలపాటు మెరుపులు.

కళ్ళు మిరుమిట్లు కొలిపే కాంతి.

సత్యమూర్తి కళ్ళు జిగేలుమన్నాయి.

మెరుపుకాంతిలో వస్తున్న ఆకారం సత్యమూర్తికి స్పష్టంగా కనిపించింది. పోతపోసిన బంగారు విగ్రహంలా వుంది ఆమె.

వర్షానికి తడిసిన బట్టలు శరీరానికి అంటుకుపోయి....

సత్యమూర్తికి మతిపోయింది. జేబులో వందరూపాయల నోట్లు కరకర మన్నాయి. ఇంతవరకూ జేబులో డబ్బులేకపోయింటే కాస్త స్థిమితంగా వుండేది అనుకున్న సత్యమూర్తి యిప్పుడు ఆ డబ్బు వున్నందుకు స్థిమితపడ్డాడు.

ఆమె కారు ముందుకు వచ్చింది. ఇంకో అయిదారు అడుగులు వేస్తే కారును దాటి వెనక్కు వెళ్ళిపోతుంది.

సత్యమూర్తి అవకాశాన్ని వృధాగా పోనివ్వదలచుకోలేదు.

ఆమె కారును సగం దాటేలోగానే పలకరించాడు 'ఏమండీ!' అంటూ. ఆమె ఉలిక్కిపడి కారు లోపలికి పరీక్షగా చూసింది.

ఎర్రటి సిగరెట్టును నోట్లో పెట్టుకుని సత్యమూర్తి కనిపించాడు.

ఒకక్షణం ఆమె జంకింది. ఒంటి కతుక్కుపోయిన చీరను ఎలా సర్దుకోవాలో తెలీక కాస్సేపు తడబడి అలాగే నిలబడింది.

"ఇక్కడికి దగ్గర్లో సిగరెట్టు కొట్టు ఏదైనావుందా?" సత్యమూర్తి అడిగాడు.

ఆమెకూడా అప్పుడే ఆ ప్రాంతాల్ని చూస్తున్నట్టు తల నాలుగువైపులా తిప్పింది.

"ఉహూఁ....ఏదీ వున్నట్టులేదు....కారు చెడిపోయిందా?"

"ఊఁ....డ్రైవర్ని ముందుకు పంపించాను ఏదైనా టాక్సీ దొరికితే తీసుకురమ్మని...."

"..................."

"సిగరెట్లు కూడా అయిపోయాయి. ఒంటరిగా తోచడంలేదు."

అని తనతో మాట్లాడిన మాటలుగా ఆమెకు అనిపించినట్లు లేదు. ముందుకు కదలబోయింది.

"ఇంత రాత్రిపూట ఎక్కడనుండి వస్తున్నారు?" అపార్థానికి ఏమాత్రమూ దారి యివ్వనట్టుగా అడిగాడు సత్యమూర్తి.

"నాలుగురోడ్ల కవతల వకీలుగారింట్లో పనిచేస్తుంటాను. రోజూ పొద్దుబోయే యీ దోవంబడి వస్తాను. ఇల్లు యిక్కడికి దగ్గరే." చాలా ప్రశ్నలకు సమాధానం చెప్పినట్టు చెప్పింది.

"మీపేరు" "జయలక్ష్మి"

సత్యమూర్తిలో ధైర్యం పుంజుకుంది.

ఎడంచేత్తో జేబులోనుండి వందరూపాయల కాగితం ఒకటి బయటికి లాగాడు.

"అయితే యీ దగ్గర్లో సిగరెట్టు కొట్టు ఏదీ వుండదంటారా?"

"ఇక్కడకాదు. అటువేపు ఆ సందులోకెళ్తే ఒకటి వుండాలి గాని రాత్రి చాలా పొద్దుపోయేంత వరకూ అది వుంటుందట."

"ఆ కొట్లో వందకు చిల్లర వుంటుందా?" సత్యమూర్తి చెయ్యి వందరూపాయల కాగితంతో సహా కారు తలుపుగుండా యివతలికి వచ్చింది.

టపటపమని చేతిమీద నాలుగు చినుకులు పడ్డాయి. సత్య

మూర్తి చెయ్యి యివతలికి లాక్కున్నాడు. 'అరరే వర్షం పడుతోం దిగా! నేనా సంగతే మరిచిపోయి మిమ్మల్ని నిలబెట్టి మాట్లాడు తున్నాను. కారు లోపలికివచ్చి కూర్చోకూడదూ?"

మళ్ళీ మెరుపు మెరిసింది. ఈమారు మెరుపులో ఆమె అతి దగ్గరగా స్పష్టంగా కనిపించింది సత్యమూర్తికి. అతని మాటలకు ఆమె విస్తుపోయినట్టు స్పష్టంగా ఆమె ముఖం చెబుతోంది.

"దగ్గరేగా యిల్లు వెళ్ళిపోతాను...."

తను యింకోక్షణం ఊరుకుంటే ఆమె వెళ్ళిపోతుందని సత్యమూర్తికి తెలుసు.

మళ్ళీ వందరూపాయల నోటు చూపుతూ, "అక్కడ చిల్లర వుంటుందో వుండదో చెప్పలేదు...." అన్నాడు.

"ఆ సంగతి నాకెలా తెలుస్తుంది? వెళ్ళి అడిగి చూడండి."

"ఆ కొట్టు ఎక్కడుందో నాకు తెలీదు....మీరేం అనుకోక పోతే ఒక నిమిషం నాతోబాటు రాకూడదూ?"

సత్యమూర్తి చొరవ జయలక్ష్మికి యిబ్బందిగా వుంది.

"వర్షం మరీ ఎక్కువవుతోంది. అయిదు నిమిషాలు లోపలికి వచ్చి కూర్చోండి. ఆ తర్వాత వెంటనే వెళ్ళిపోవచ్చు."

వందరూపాయల కాగితం అటూ యిటూ కదుల్తోంది.

సత్యమూర్తి ఉద్దేశం ఆమెకు అర్థమయింది.

ఇక తను యింకో క్షణమైనా అక్కడ నిలబడ్డం అనవసరం అన్నట్టు ముందుకు కదలబోయింది.

ఆమె ప్రయత్నాన్ని గమనించిన సత్యమూర్తి చెయ్యి నిరోధించడానికి ప్రయత్నించింది.

సత్యమూర్తి చెయ్యి జయలక్ష్మి జబ్బను గట్టిగా పట్టుకుంది.

చేతికి చివరవున్న వందరూపాయల నోటు ఆమె శరీరానికి రాసుకుంటోంది.

ఆమె పెనుగులాడింది. అతని చేతి పట్టునుండి తప్పించుకోవడానికి ప్రయత్నించింది.

మగవాళ్ళ సంగతి తెలీదుగాని సత్యమూర్తి ఆడవాళ్ళను పట్టు

కుంటే ఒకపట్టాన వదిలిపెట్టడు. ఆ సంగతి ఆమెకు తెలీదు.

మగవాళ్ళు తన ఒంటిమీద చెయ్యి వెయ్యడానికి ప్రయత్నిస్తే వాళ్ళ చెంపలు ఎంత గట్టిగా వున్నాయో జయలక్ష్మి పరీక్షించి చూస్తుంది. ఆ సంగతి సత్యమూర్తికి తెలీదు.

పట్టుకున్న చెయ్యి అట్లాగే వుంచి కారు డోర్ తెరిచాడు సత్యమూర్తి. కారు తలుపు మధ్యలో ఆమెను పట్టుకున్న చెయ్యి వుండిపోవడంతో దాన్ని వదిలి రెండోచేత్తో ఆమెను పట్టుకోవాలని సత్యమూర్తి ప్రయత్నించాడు.

ఆ అవకాశం చాలు ఆమెకు. ఛెళ్ళుమని ఆమె రెండో చెయ్యి-గాల్లోకి లేచి సత్యమూర్తి చెంపను తాకింది.

మళ్ళీ మెరుపు మెరిసింది. సత్యమూర్తి కళ్లలోకూడా.

మెరుపు మాయమయ్యేలోపలే ఆమె ఏడెనిమిది అడుగులు విసురుగా ముందుకు వెళ్ళిపోయింది. సత్యమూర్తి చేతినుండి క్రిందికి జారిన వందరూపాయల కాగితం వర్షపునీటిలో పడింది.

సత్యమూర్తి శరీరాన్ని మళ్ళీ కారులోకి చేర్చాడు. ఒళ్లంతా వెచ్చగా వుంది. రక్తప్రసారం బాగా జరుగుతున్నట్టు శరీరం తేలికగా అనిపిస్తోంది. సత్యమూర్తి చెయ్యి చెంపను తడుముకుంది.

"ఎంత పొగరు? ఆఫ్ట్రాల్ పాచిపనిచేసే వెధవముండ.... వందరూపాయలనోటు కళ్లముందు ఆడించినా లెక్కచెయ్యకుండా చెంపదెబ్బ కొడుతుందా...." జీవితంలో యింతపెద్ద దెబ్బతినడం సత్యమూర్తికి యిదే మొదలు.

అసలు పూర్తికావనిపించే పనుల జోలికెప్పుడూ సత్యమూర్తి వెళ్లడు. చెయ్యి పట్టుకోవడమంటే....యిక తిరుగులేని కేసు అయి వుండి తీరాలి.

ఈరోజు మాత్రం అంచనాలో పొరబాటు జరిగింది.

"మిస్ ఆర్ మిసెస్ జయలక్ష్మి ఐ విల్ నాట్ లీవ్ యూ" కసిగా అనుకున్నాడు సత్యమూర్తి.

*　　*　　*

కొండ్రలావు పేరుమోసిన రౌడీ అని ఆ ప్రాంతాల్లో అందరికీ

తెలుసు. కత్తులు కైజార్లతో తిరక్కపోయినా రాసుకెళ్తే ఏ డొక్కలో యేం గుచ్చుకుంటుందో అని అందరికీ అనుమానమే!

కొండ్రావు సత్యమూర్తి ఆఫీసులో అడుగుపెట్టేసరికి అతన్ని ఎరిగున్న వాళ్ళందరి ముఖాలమీద ప్రశ్నార్థక చిహ్నాలు వెలిగాయి.

కొండ్రావు మీసంమీద చెయ్యేసి ఓమారు సవరించుకుని సత్యమూర్తి గదిలోకి అడుగుపెట్టాడు.

సత్యమూర్తి చిరునవ్వుతో ఆహ్వానించాడు కొండ్రావుని.

"విషయం చెప్పండి...." వచ్చి కూర్చుంటూనే అడిగాడు కొండ్రావు.

"చాలా సింపుల్! రంగరాజుపేట ఏరియాలో 'జయలక్ష్మి' అనే గడుసు చిన్నది ఒకతె వుంది. అది నన్ను ఇన్సల్టు చేసింది...." మొహమాటం లేకుండా చెప్పాడు సత్యమూర్తి.

"చ్చ్చ్" సానుభూతి చూపించాడు కొండ్రావు. "వ్యవహారం అర్థమయిపోయింది లెండి" అన్నాడు.

"అదెవరో నీకు తెలుసా?"

"తెలుసా అంటే తెలుసు అనే చెప్పాలి. అయితే నా ప్రిస్టేజికి భంగం వస్తుందని దానిజోలికి యింతవరకూ వెళ్ళలేదు. ఇప్పుడు అయ్యగారి పని కాబట్టి జోక్యం చేసుకోక తప్పదు....అవన్నీ మీకెందుకు? పని పూర్తి చేయడమేగా మీక్కావల్సింది."

"ఎంతవుతుంది?"

"మూడొందలు."

సత్యమూర్తి జేబులోనుండి వందరూపాయల కాగితం ఒకటి యివతలికి తీసి కొండ్రావు ముందు పడవేసి "అడ్వాన్సు కింద వుంచుకో. ఎంత తొందరగా సాధిస్తే అంత తొందరగా మిగిలిన డబ్బు నీ చేతికొస్తుంది."

గారపళ్లను కరకర లాడిస్తూ కొండ్రావు నోటును అందుకుని పక్కజేబులో కుక్కుకుని పైకిలేచాడు.

సత్యమూర్తి ఫైళ్ళలో మునిగిపోయాడు.

*    *    *

"పనిమనుషు లెవరూ నెలరోజులకు మించి వుండడంలేదు. మీకు యెన్నిమార్లు చెప్పినా పట్టించుకోవడంలేదు" రాజేశ్వరి భర్తతో అంది.

"పట్టించుకోలేదని యెందుకనుకుంటావు? కాస్త కాస్త నమ్మక ముండేవాళ్లను యెవరైనా చూడమని ఒకతనికి చెప్పాను. వారం పదిరోజుల్లోపల చూస్తాడేమో, అంతవరకూ యెలాగో సర్దుకో."

భార్య అంటే సత్యమూర్తికి విపరీతమైన అభిమానం. తనకు అనుకూలంగా వుండడం, అపురూపమైన అందగత్తెకావడం సగం కారణమయితే మిగిలిన సగం రాజేశ్వరి భర్త యితర వ్యవహారాల్లో జోక్యం కల్పించుకోకపోవడం.

ఆ కల్పించుకోకపోవడానికి కారణం ఆమెకు భర్తమీదవున్న నమ్మకం. తనను తప్పిస్తే యింకెవర్నయినా కన్నెత్తికూడా చూడ డని రాజేశ్వరి నమ్మకం.

దానికి కారణం తన అందచందాలమీద తనకున్నఅభిప్రాయం.

రాజేశ్వరి రోడ్డుమీద నడుస్తుంటే చూసినవాళ్లలో సగం మందికయినా చూపులు తిప్పుకోవడానికి కొంత టైం పడుతుంది. ఆ సంగతి రాజేశ్వరికి తెలుసు.

అలాంటప్పుడు తనభర్త సత్యమూర్తి ఊహల్లోకి యింకో అమ్మాయి వచ్చే ప్రసక్తే లేదని రాజేశ్వరి అనుకుంటుంది. దానికి తోడు సత్యమూర్తి అనుమానాస్పదంగా యెప్పుడూ ప్రవర్తించలేదు.

అతని ఆఫీసు స్టెనో మిస్ ఎలిజబెత్‌గాని అకౌంట్స్ అసిస్టెంట్ పంకజవల్లిగాని యూనియన్ బాంక్ కేషియర్ మాధవిగాని సత్యమూర్తి గురించి చాలాచాలా చెప్పగలరుగాని రాజేశ్వరికి వాళ్లను అడిగే స్కోప్ లేదు.

రాజేశ్వరికి పూలన్నా పూలమొక్కలన్నా ప్రాణం. తోటలో తనే స్వయంగా యెన్నో పూలమొక్కల్ని తెచ్చి నాటి వాటికి నీళ్ళు పొయ్యడం దగ్గర్నుంచి యెరువులు వెయ్యడంవరకూ దగ్గరుండి పని మనుషులుచేత చేయిస్తూ జాగ్రత్తగా చూసుకుంటుంది.

అయితే రాజేశ్వరి ఆ చెట్లలోని పూలను యెప్పుడూ

కొయ్యడు. సత్యమూర్తికి యీ విషయం చాలా విచిత్రంగా అనిపిస్తూ వుంటుంది.

ఒకరోజు అదే విషయం భార్యను అడిగాడు. "అంత కష్టపడి పూలచెట్లను పెంచుతున్నావు కదా! ఎప్పుడూ ఒకటయినా కోసి తల్లో పెట్టుకోవు దేనికి?" అని.

ఈ ప్రశ్నకు రాజేశ్వరి చెప్పిన సమాధానం సత్యమూర్తికి నవ్వు తెప్పించింది.

"పూలంత అందంగా వున్నాయి. వాటిని కోస్తే అవి వాటి నుండి విడిపోతాయిగా! అది నా కిష్టం వుండదు" అంది.

'ఉత్త సెంటిమెంటల్ ఫూల్' అనుకున్నాడు సత్యమూర్తి.

* * *

కొండల్రావు మిగిలిన రెండొందల రూపాయలూ వదులుకో లేదు. సత్యమూర్తి సంతోషంగా యిచ్చాడు.

జయలక్ష్మి సత్యమూర్తి యింట్లో పనిమనిషిగా చేరింది.

మొదటి పదిరోజులూ తను ఆమె కంటిముందు పడకుండా జాగ్రత్తపడ్డాడు సత్యమూర్తి. పదకొండోరోజు కావాలనే జయలక్ష్మి వచ్చేవేళకు హాల్లో కూర్చున్నాడు సత్యమూర్తి.

జయలక్ష్మి అంతవరకూ అయ్యగారిని చూళ్ళేదు.

గుమ్మందాటి లోపలికి అడుగుపెట్టగానే అక్కడ కూర్చున్నది యింటి యజమాని అని జయలక్ష్మికి అర్థమయిపోయింది.

అక్కడే ఆగి తను వచ్చినట్టు ఒక పొడిదగ్గు దగ్గి సత్యమూర్తి తలెత్తి చూడగానే 'అమ్మగారు....' అంటూ ప్రశ్నార్థకంగా ఆపింది.

లోపలికి రమ్మన్నట్టు తల ఆడించాడు సత్యమూర్తి.

జయలక్ష్మి లోపలకి వచ్చింది.

సత్యమూర్తి కళ్ళజోడు తీసి పక్కనపెడుతూ, "నువ్వేనా కొత్తగా పనిలో చేరింది?" అన్నాడు.

ఔనన్నట్టు తల ఊపింది జయలక్ష్మి.

"పేరేమిటి?"

"జయలక్ష్మి"

"ఎక్కడుంటున్నావు?"

"రంగరాజుపేట"

"రంగరాజుపేటా....ఇక్కడికి చాలా దూరంకదూ?"

"ఔనండి."

"మరి రోజూ....బస్సులోనే వచ్చి వెళ్తున్నావా?"

"ఔనండి"

"గంటపైగా పడుతుంది. కష్టంకదూ?"

"ఔనండి"

"మరి యింతదూరం దేనికి వస్తున్నావ్?"

"..........."

"ఆవైపే ఎవరింట్లోనయినా కుదరకూడదా?"

"కొండలయ్య యిక్కడే పన్జేయాలని పట్టుబట్టాడండి. అయ్యగారు ధర్మాత్ములు ఓ పది ఎక్కువిచ్చుకుంటాడు అనికూడా చెప్పాడండి."

"అంటే పది రూపాయలు ఎక్కువ వస్తున్నాయని వస్తున్నావన్నమాట."

"..........."

"తగ్గించి యిస్తే రావా!"

విచిత్రంగా చూసింది జయలక్ష్మి సత్యమూర్తి వంక. అతని మాటల ధోరణి ఆమెకు అర్థంకావడంలేదు.

రెండోమారు తలెత్తిచూసినప్పుడు జయలక్ష్మికి సత్యమూర్తిని అంతకు మునుపు ఎక్కడో చూసినట్టు అనిపించింది.

జ్ఞాపకాలు గిర్రున తిరిగాయి. బాగా చూసినట్టు అనిపిస్తోంది గాని ఎక్కడో తెలియడంలేదు. ఎక్కడ ఎక్కడ?....

సత్యమూర్తి నవ్వుతూ ప్రశ్నను రెట్టించాడు.

ఉలిక్కిపడి వాస్తవంలోకి వచ్చింది జయలక్ష్మి "తమరు పెద్దోళ్లు. మీతో నేను మాట్లాడేదాన్నా? అయినా మీరు చెప్పిందే వాస్తవం బాబూ!" అంది.

సత్యమూర్తి సాలోచనగా తల పంకించాడు "బస్సు చార్జీలు

ఎక్కువవుతాయిగా! ఇంకో అయిదు రూపాయలు ఎక్కువ తీసుకో, అమ్మగారు నువ్వు ఒళ్ళొంచి కష్టపడతావని చెప్పింది” అన్నాడు.

ఆ తర్వాత రెండురోజులు సత్యమూర్తి జయలక్ష్మి వస్తోందా లేదా అని ప్రత్యేకంగా గమనించాడు. తనను గుర్తుపట్టి వుండడం జరిగితే వెంటనే మానేస్తుంది అనుకున్నాడు.

అలాంటిదేం వున్నట్టులేదు. జయలక్ష్మి మామూలుగానే పన్లోకి వస్తోంది. నెల పూర్తయి జీతండబ్బులుకూడా తీసుకుంది.

రెండో తారీఖు ఆదివారం. ఆ రోజుమీద సత్యమూర్తి చాలా ఆశలు పెట్టుకున్నాడు.

జయలక్ష్మి పదింటికి పాచిపనులు పూర్తిచేసి వంట అయ్యేంత వరకూవుండి వెళ్ళిపోయింది. మళ్ళీ సాయంత్రం అయిదింటికిరావడం.

సత్యమూర్తి పన్నెండు ప్రాంతంలో, “మీ పిన్నిగారింటికి వెళ్ళిరావాలని చాలా రోజుల్నుండి అంటున్నావుకదా! ఈ రోజు వెళ్దాం” అన్నాడు.

రాజేశ్వరి పిన్నివాళ్ళు వుంటున్నది అభిరామపురంలో. కారులో వెళ్తే దాదాపు గంట ప్రయాణం. తను ఒంటరిగా అయితే టాక్సీలో వెళ్ళిరావాలి. సత్యమూర్తితోబాటు అయితే తను కారులోనే వెళ్ళి రావచ్చు. తను ఒంటరిగా డ్రైవ్ చేసుకుని వెళ్ళాలంటే భయం. రాజేశ్వరి వెంటనే ఒప్పుకుంది.

సత్యమూర్తి నాలుగింటికే రెడీ అయి రాజేశ్వరిని తొందర చేశాడు.

అప్పటికి అర్ధగంట ముందే ముస్తాబవడం మొదలుపెట్టిన రాజేశ్వరి యింకా రెడీకాలేదు.

సత్యమూర్తి అసహనంగా సోఫాలో కూర్చుని సిగరెట్టు కాలుస్తూ 'ఎంతసేపు రాజీ!” అంటూ అయిదు నిమిషాలకోమారు టైంప్రకారం హెచ్చరించసాగాడు.

“మీరెప్పుడూ యింతే! ప్రతీదీ తొందరగా కావాలంటారు. అన్నీ ఎలా వీలవుతాయి?” ఆమె చీర కుచ్చిళ్ళను సరిచేసుకుంటూ హాల్లోకి వచ్చింది.

ఆకుపచ్చని పట్టుచీర, అదే రంగు రవిక, మెడలో ఒకే గొలుసు, బంగారం రంగు శరీరంమీదికి వినూతన శోభను తెచ్చిపెడుతున్నాయి. సత్యమూర్తి అసహనం అంతరించిపోయింది. రాజేశ్వరిని దగ్గరగా లాక్కున్నాడు.

ఆమె చీరకొంగు తగిలి టేబుల్‌మీది త్రాగి వుంచిన మంచి నీళ్ళ గ్లాసు ఒలికింది. సత్యమూర్తి ప్యాంటుతోపాటు రాజేశ్వరి చీర కూడా కొద్దిగా తడిచింది.

ఆమె సిగ్గుపడుతూ, "చీర మార్చుకుంటాను. ఎవరైనా చూస్తే నవ్వి పోగలరు" అంది.

సత్యమూర్తి టైమ్ చూసుకున్నాడు. నాలుగు ముప్పైఅయిదు "ఉహుఁ....యిలాగే వెళ్దాం. టైమ్ అవుతోంది" అన్నాడు.

రాజేశ్వరికి మనసులో వెలితిగానే వుంది. చీరమీద మంచి నీళ్లు పడ్డాయని కాదు. మార్చి వేరే కట్టుకుందాము అని అనుకొని కూడా కట్టుకోకుండా అలాగే బయలుదేరి వెళుతున్నందుకు.

సత్యమూర్తి అదేమీ పట్టించుకోవడం లేదు.

గత్యంతరం లేక రాజేశ్వరి భర్తను అనుసరించింది.

కారు ఎక్కబోతుండగా రాజేశ్వరికి జయలక్ష్మి గుర్తుకు వచ్చింది. "పనిమనిషి అయిదింటికి వస్తుంది. మనం ఉదయం వెళ్ళేటప్పుడైనా దానికి చెప్పలేదు. అయిదింటికి వచ్చి యిక్కడే కూర్చుంటుందేమో" అంది.

"ఫర్వాలేదులే. కాసేపు చూచి అదే వెళ్తుంది" కార్ స్టార్ట్ చేస్తూ అన్నాడు సత్యమూర్తి. మూవీలాండ్ సర్కిల్ దగ్గర కారు ఆపాడు సత్యమూర్తి. రాజేశ్వరి కారుదిగి ఎదురుగావున్న ఫాన్సీ షాప్‌లో పిల్లలకు కొన్ని బొమ్మలు కొంది.

ఈ మారు బయలుదేరిన కారు మళ్ళీ సత్యమూర్తి ఆఫీస్ ముందు ఆగింది. "ఇక్కడ యెందుకు ఆపారు?" రాజేశ్వరి టైమ్ చూసుకుంటూ అడిగింది.

"ఒక్క పది నిమిషాలు కూర్చో రాజీ వెంటనే వచ్చేస్తాను."

"ఆదివారం కూడా మీ ఆఫీస్ పని చేస్తుందా?"

"ఒక్కోమారు అర్జెంట్ పనులుంటే పనిచేయక తప్పదు. నా వర్క్ కూడ కాస్తవుంది. అసిస్టెంట్‌కు ఇన్‌స్ట్రక్షన్ యిచ్చి వచ్చాను. ఏం చేశాడో చూసి రావాలి" కారుదిగి తలుపును పెద్దగా శబ్దించేసి మూస్తూఅన్నాడు. "తొందరగారావాలి" రాజేశ్వరి గునిసింది.

"ఓకే" అంటూ గబగబ అడుగులు వేసుకుంటూ సత్యమూర్తి ఆఫీస్ లోపలికి వెళ్ళాడు. వెళుతున్న సత్యమూర్తి వంక నిర్నిమేషంగా చూడసాగింది రాజేశ్వరి.

రాజేశ్వరి ఊహలతో తాళ్ళను పేనసాగింది. తన ఆశా సముద్రానికి సత్యమూర్తి చెలియలి కట్ట. అయినా తనకు అతడు ఎప్పుడూ ప్రతిబంధకం కాదు.

చిన్నప్పటి నుండి తన బ్రతుకు సిద్ధార్థుడి చిన్నప్పటి బ్రతుకు లాంటిది. కపటం ఎరుగని మనుష్యులమధ్య తను పెరిగింది. మోసం, వంచన అంటే ఏమిటో తెలియవు. అలాంటి మనుషులు తన జీవితంలో యింతవరకు తారసపడలేదు.

ఎందుకో హింసను చూస్తే తన మనసు విపరీతంగా చలించిపోతుంది. తనను భయపెట్టే ఏ దుర్గుణంలేని సత్యమూర్తి తనపాలిటి దేవుడు.

ఎందుకో సత్యమూర్తిని చూస్తే బుద్ధుడు గుర్తుకు వస్తాడు. తనకిష్టమైన దేవుడు బుద్ధుడు.

ఆలోచనల్లోపడి రాజేశ్వరి టైమ్ చూసుకోలేదు. పదిహేను నిమిషాలు దాటిపోయింది. సత్యమూర్తి యింకా రాలేదు.

ఆఫీస్ గేటువంక చూపులు నిలిపి మళ్ళీ ఆలోచనల్లోకి జారిపోయింది. ఒక విచిత్రమైన ఊహ వచ్చింది రాజేశ్వరికి. "తన భర్త తనను యెప్పుడైనా నిరాదరించడం జరిగితే?"—ఆ ఆలోచన వచ్చిన వెంటనే 'అమ్మో!' అంటూ గుండెల మీద చెయ్యి వేసుకొంది.

"ఛీ ఛీ! ఈ రోజు యెందుకిలా పాడు ఆలోచనలన్నీ వస్తున్నాయి!" అనుకుంటూ సర్దుకొని కూర్చుంది.

"అమ్మగారూ!" అంటూ పదేళ్ళ కుర్రాడు ఒకడు ఆఫీస్‌లో నుండి పరుగెత్తుకుంటూ వచ్చి కారుదగ్గర నిలబడ్డాడు.

రాజేశ్వరి ఏమిటన్నట్లు వాడిపంక చూసింది.

"అయ్యగారు మీ కిమ్మన్నారు" అంటూ ఒక కాగితం రాజేశ్వరి చేతికందించి వచ్చినంత స్పీడ్‌గానే వెనక్కి తిరిగి పరిగెత్తు కుంటూ వెళ్ళిపోయాడు ఆఫీసులోకి. రాజేశ్వరి కాగితం విప్పిచూసింది.

డియర్,

చాలా అర్జెంట్ పని ఒకటి పడింది. గంటపైగా పడు కుంది. నువ్వీలోపల నెమ్మదిగా డ్రైవ్ చేసుకుంటూ అభిరామ పురానికి వెళ్ళు. నేను టాక్సీలో వస్తాను. నేను వచ్చిం తర్వాత కాస్సేపు వుండి తర్వాత తిరిగి వచ్చేద్దాం. సారీ! ఒంటరిగా పంపిస్తున్నాను.

—సత్యం"

కాగితాన్ని మడిచి హాండ్‌బ్యాగ్‌లో పెట్టింది రాజేశ్వరి.

తనిప్పుడు నేరుగా అభిరామపురానికి వెళ్ళాలా వద్దా? లేకుంటే ఈ గంటసేపు ఇక్కడే ఎక్కడైనా తిరిగి భర్తతోపాటు ఒకేమారు వెళ్ళొచ్చు కదా అనుకొంది.

ఇంటికి వెళ్ళి బట్టలు మార్చుకొని వస్తే యెటూనూ గంట అవుతుంది అని కూడా అన్పించింది రాజేశ్వరికి.

రాజేశ్వరిలో చిరాకు మొదలయింది. అనుకున్నది అనుకున్నట్లు జరక్కపోతే యెప్పుడూ యింతే! ఆ అర్జంట్ పనేదో యిప్పుడే రావాలా సత్యమూర్తికి.

తను సొంతంగా డ్రైవ్‌చేసి చాలా కాలమయిందన్న ఒక విషయం మాత్రం రాజేశ్వరికి కొంత రిలీఫ్‌నిచ్చింది.

ఇంకో అయిదునిమిషాలు స్టీరింగ్ ముందు కూర్చునే ఆలో చించి నేరుగా అభిరామపురానికే వెళ్ళడానికి నిర్ణయించుకుంది.

సైడ్‌మిర్రర్‌లో ఒకమారు మొహం చూసుకొని వెంట్రుకలు సర్దుకొని కారు స్టార్ట్ చేసింది.

రాజేశ్వరికి స్పీడ్ నచ్చదు. కారును యెప్పుడూ నెమ్మదిగానే తోలుతుంది. కానీ ఆ రోజు యెందుకో ఆమె మనసులో ఆమెకే స్పష్టంగా తెలియని ఉద్విగ్నత ఎక్కువైంది.

మునుపెన్నడూ వెళ్ళనంత స్పీడ్‌లో ఆమె కారు ముందుకు అభిరామపురం వైపు దూసుకువెళ్ళసాగింది.

* * *

రాజేశ్వరి కారు బయలుదేరిన యింకో అయిదు నిమిషాలకు సత్యమూర్తి ఆఫీస్‌నుండి బయటకు వచ్చి టాక్సీ తీసుకొని మధ్యలో మల్లెపూలు కొనుక్కొని ఇంటికి బయలుదేరాడు.

టాక్సీ సత్యమూర్తి ఆత్రానికి అనుగుణంగా వేగంగా వెళ్ళ సాగింది. టాక్సీ యింటిముందు ఆగినా సత్యమూర్తి వెంటనే క్రిందకు దిగలేదు. ప్యాంటుజేబులో నుండి తీరిగ్గా సిగరెట్టుపెట్టె పైకితీసి యెంచుకొన్నట్టు ఒక సిగరెట్టు అందుకొని వెలిగించాడు.

టాక్సీడ్రైవర్ అసహనంగా వెనక్కితిరిగి సత్యమూర్తివంక చూశాడు.

సత్యమూర్తి అది పట్టించుకోకుండా ఇంకొన్ని క్షణాలు ఆగి ఆ తరువాత హఠాత్తుగా పైకిలేచి జేబులోనుండి పదిరూపాయల నోటుతీసి డ్రైవర్ చేతిలో పెట్టాడు.

టాక్సీ డ్రైవర్ చిల్లర అంటున్నా వినిపించుకోకుండా వేగంగా గేటు తీసుకొని లోపలికి వెళ్ళి వరండాలో నిలబడి చుట్టూ చూడసాగాడు.

సత్యమూర్తికి జయలక్ష్మి ఎక్కడా కనిపించలేదు. వేళ్ళ మధ్యలోనున్న సిగరెట్టు చురుక్కుమంది.

సత్యమూర్తి సిగరెట్‌ను విసురుగా కింద పడవేశాడు. తాళం తీసి లోపలికి వెళ్ళి హాల్లో కూర్చున్నాడు. తను కూర్చున్న సోఫా కెదురుగావున్న వీధి తలుపుల్నీ, తలుపులకు సమాంతరంగావున్న వరండాలోని రెండు స్తంభాల్నీ, వరండానుండి గేటువరకూ మధ్య నున్న చక్కని రోడ్డునూ మార్చి మార్చి చూస్తూ జయలక్ష్మి కోసం ఎదురు చూడసాగాడు.

ఆరు సిగరెట్లు ప్యాకెట్‌లోనుండి సత్యమూర్తి పెదవుల మధ్యకు వెళ్ళి కాలి నుసిగా మారిపోయాయి. ఏదో సిగరెట్ తలుపు దగ్గరనున్న తివాచీమీద పడింది. పూర్తిగా ఆరని సిగరెట్ తివాచీని

కాల్చసాగింది. దానినుండి వెలువడుతున్న పొగ అతి సన్నగా పాములా మెలికలు తిరుగుతూ గాలిలోకి అదృశ్యమవుతోంది.

సత్యమూర్తి తదేకంగా సిగరెట్ చూపిస్తున్న అందాల్ని బేరీజు వేయసాగాడు. ఆలస్యంగా వచ్చాను అని అనుకుంటూ ఆత్రంగా వచ్చిన జయలక్ష్మి తివాచీమీద సిగరెట్టు పడినచోట కాలుపెట్టింది. కాలు చురుక్కుమంది.

తను చూస్తున్న దృశ్యం మాయమనగానే తలెత్తిచూశాడు సత్యమూర్తి.

'ఆలస్యం అయిపోయింది బాబుగారు' అంటూ ఒక క్షణం చేతులు నులుముకుని ఆ తర్వాత వేగంగా హాలు దాటి వంటింటివైపు వెళ్ళిపోయింది జయలక్ష్మి.

వంటింట్లోనూ, పెరట్లోనూ ఎక్కడా కనిపించని అమ్మగారి కోసం మళ్ళీ హాలులోకి వచ్చిన జయలక్ష్మికి ముందు తలుపులకు గడియ పెట్టబోతున్న సత్యమూర్తి కనిపించాడు.

"బాబుగారు" అంది అర్థంకాక జయలక్ష్మి.

సత్యమూర్తి జవాబివ్వలేదు.

తాపీగా తలుపులకు గడియపెట్టి వెనక్కి తిరిగి జయలక్ష్మి ముఖంలోకి సూటిగా నిర్నిమేషంగా చూడసాగాడు.

జయలక్ష్మికి తన గొంతునెవరో నొక్కిపెట్టినట్లు అనిపించింది.

నిప్పులు క్రక్కుతున్నట్లు సత్యమూర్తి కళ్లు మెరుస్తున్నాయి.

ఆ మెరిసే కళ్లను తను ఈ యింట్లోకి అడుగుపెట్టక మునుపు ఎక్కడో చూసింది. గుర్తు రావడంలేదు.

సత్యమూర్తి ఒక అడుగు ముందుకు వేశాడు.

జయలక్ష్మికి పరిస్థితి చూచాయగా అర్థమవుతోంది.

డగ్గుత్తికలో మళ్ళీ 'బాబుగారు' అంది.

ఒక బలహీనమైన క్రౌర్యంతో నిండిన పలుచటి చిరునవ్వు సత్యమూర్తి పెదవులమీద ఒక క్షణం మెరిసి మాయమయింది.

"నేను బాబుగారిని కాను" నింపాదిగా అన్నాడు సత్యమూర్తి.

జయలక్ష్మిలో ప్రశ్నలు సంఘర్షణ పడుతున్నాయి. 'ఎవరీ బాబుగారు? నా గొంతు కెందుకీ ఉరిత్రాడు బిగిస్తున్నాడు?'—ఆమెకు సమాధానం దొరకటం లేదు.

"నే నెవరో నీకు గుర్తురాలేదూ?"

అసహాయంగా తల అడ్డంగా తిప్పింది జయలక్ష్మి.

"అంటే నాలాంటివాళ్లు నీకు చాలామంది తగిలే వుంటారన్న మాట. ఎంతమందిని అలా చెంపదెబ్బలు కొట్టావ్?"

చళ్లుమని కొట్టినట్లు జయలక్ష్మికి ఆనాటి వర్షం రాత్రిలో జరిగిన సంఘటన గుర్తుకు వచ్చింది.

'కారులో కూర్చొని తన చేతినెవరో లాగారు. ఆ రోజు, అతనే యితనన్నమాట!' జయలక్ష్మి మస్తిష్కం వేడెక్కసాగింది. 'మీరా!'. అంది.

సత్యమూర్తి మళ్ళీ నవ్వాడు. ఈమారు అతని నవ్వు మొదటి కన్నా రెండింతలు కర్కశంగా వుంది.

"గుర్తుకొచ్చిందా? ఆరోజు చెంపదెబ్బ తినింది నేనే!"

ఫ్యాన్ గాలికి వెంట్రుకలు అటు యిటూ కదలినట్లు జయలక్ష్మి మనసు చలించసాగింది. "అన్యాయం బాబుగారూ!" అంది.

సత్యమూర్తి మళ్ళీ నవ్వాడు.

"అయితే కొండలయ్య దగ్గర చెప్పించి నన్ను యిక్కడికి పిలిపించడంలోకూడ ఉద్దేశ్యం యిదేనన్నమాట."

"ఇప్పటికైనా అర్థమయినందుకు సంతోషం." సత్యమూర్తి ఒక్కో అడుగు ముందుకు వేస్తున్నాడు.

అతను యిద్దరిమధ్యా దూరాన్ని మాయంచేయడానికి ప్రయత్ని స్తున్నాడు.

ఆమె ఇద్దరిమధ్య దూరాన్ని దూరం చేయటానికి ప్రయత్ని స్తోంది.

ఎదురుగా మూసిన తలుపులు....పక్కనున్న కిటికీలు తెరప

బడ్డాయి కాని వాటి మధ్యలో నున్నవి చీపులుపుల్లలు కావు. ఇనుప కడ్డీలు.

తను యీ విషమ పరిస్థితినుండి ఎలా బయటపడాలో జయలక్ష్మికి తోచడం లేదు. ఇంట్లో యెవరూ లేరు. తను గట్టిగా అరచినా ప్రయోజనం వుండదు. తన పిలుపు గది దాటకపోవచ్చు. దాటినా వరండాలోనే ఆగిపోవచ్చు. వరండా దాటినా తోట దాటదు. అన్నీ దాటి వీధిలోకి వినిపించినా ఎవరూ పట్టించుకోకపోవచ్చు.

జయలక్ష్మికి ఆ సమయంలో తను నగరానికి కొన్ని వేలమైళ్ళ దూరంలో వున్నట్లు అనిపించింది.

తను వూరకే హైరనాపడటంతప్ప ప్రయోజనమేమి వుండదని స్పష్టంగా తెలుస్తోంది.

సత్యమూర్తి మన్నుతిన్న పాములా చిన్నగా ఒక్కో అడుగు మాత్రమే ముందుకువేస్తూ వస్తున్నాడు. వంట ఇంటి కుందేలు అన్న నమ్మకం కాబోలు!

వెనక్కి జరుగుతూ శవంలా వెళుతున్న జయలక్ష్మికి గోడ అడ్డం వచ్చింది. తల కొద్దిగా పక్కకు తిప్పి చూసింది జయలక్ష్మి. బారెడు దూరంలో పెరటివైపు వెళ్ళడానికి తలుపులు తెరచి ఉన్నాయి.

ఒక్క వూపులో అన్నిటికీ తెగించి జయలక్ష్మి ఒకక్షణంలో ఆ తలుపుల దగ్గరికి చేరుకుంది.

జయలక్ష్మి కంటే అరక్షణం ముందుగా అక్కడికి చేరుకున్నాడు సత్యమూర్తి.

జయలక్ష్మి ఓడిపోయింది.

సత్యమూర్తి ఒకచేత్తో పట్టుకుంటేనే విడిపించుకోవడం ఎంత కష్టమో ఆమెకు యింతకుముందే తెలుసు.

సత్యమూర్తి రెండు చేతులతోనూ జయలక్ష్మిని ఆక్రమించుకొన్నాడు.

సత్యమూర్తిలోని కసి కరగిపోయింది. ఆష్ట్రేలోకి నెట్టే సిగరెట్టులా జయలక్ష్మిని వదలిపెట్టాడు.

పెట్టెలోనుండి కొత్త సిగరెట్‌నుతీసి ముద్దు పెట్టుకోబోతు

న్నట్లు పెదవుల మధ్య యిరికించుకొన్నాడు.

జయలక్ష్మి ఒక్క వుదుటున పైకిలేచి బయటికి పరిగెత్తింది.

పరిభ్రమిస్తున్న ఆమె మనసుకు తలుపులు తెరచుకొని అవతలకి అడుగుపెట్టినప్పుడు గుమ్మానికి దగ్గరగా ఒకపక్క యెవరో నిలబడి వున్నట్లు అనిపించింది. ఆ నిలబడి చూస్తున్నది రాజేశ్వరి కాదుకదా అన్న అనుమానం ఆమెకు కలిగింది.

తరువాత రెండుక్షణాలు గడిచేసరికి 'ఆ చూసింది రాజేశ్వరే! సందేహంలేదు. సత్యమూర్తి నాకుచేసిన అన్యాయాన్ని ఆమె కళ్ళారా చూసింది' అన్న నమ్మకం ఆమెలో బలపడింది.

* * *

"జయలక్ష్మి బయటికి దూసుకవెళ్ళగానే అంతవరకు అక్కడే నిలబడి అంతా చూస్తూన్న రాజేశ్వరి విసురుగా లోపలికి అడుగు పెట్టింది.

తాపీగా సిగరెట్టు వెలిగించుకొని పీలుస్తున్న సత్యమూర్తి ముఖంలోకి భార్యను చూడగానే రక్తం ప్రవహించడం ఆగిపోయింది.

కంగారుగా చేతి గడియారంవంక చూశాడు. 'ఆరు దాటింది. "నువ్వు అప్పుడే ఎందుకు వచ్చేశావు. అభిరామపురం వెళ్ళి అక్కడే వుండమన్నానుగా!" తడబడుతూ అన్నాడు.

"ఏం? నేను రావడంవల్ల మీ బండారం బయటపడిందనా?" ఆమె కళ్ళు నిప్పులు చెరగుతున్నాయి.

"అదికాదు రాజీ...."

"ఏదికాదు? మీరేం నాకు చెప్పాల్సిన అవసరంలేదు. నేనేమీ విననుʼʼ కోపంతో వణకిపోతున్న పెదవులతో రాజేశ్వరి అంటూ హాండ్‌బ్యాగ్‌లోని పిస్టల్‌ను యివతలికితీసింది.

"రాజీ" కెవ్వుమని కేకపెట్టాడు సత్యమూర్తి.

ఆ కేకలోనే రాజేశ్వరి పేల్చిన పిస్టల్ గుండు చేసిన ధ్వని మిళితమయింది.

"అబ్బా" అంటూ కిందికి కుప్పలా కూలిపోయాడు సత్య

మూర్తి. కాసేపు రక్తంలో విలవిలా తన్నుకొని చనిపోయాడు.

"ఉహూ రాజేశ్వరికి భర్తమీద పిస్టల్‌పేల్చి చంపేంత ధైర్యం వుండదు" అటుతిరిగి పడుకుంటూ అనుకుంది జయలక్ష్మి.

బలవంతంగా కళ్ళు మూసుకుంది.

ఒకటే ఆలోచనల రొద....తన బ్రతుకునింత క్షోభపెట్టిన సత్య మూర్తి బాగుపడడు. రాజేశ్వరికి యీ సంగతి తెలియడం ఖాయం. వాళ్ళ సంసారంలో యీ సంఘటన నిప్పులు చెరక్కమానదు. కసిగా అనుకుంది జయలక్ష్మి. మళ్ళీ కళ్లు మూతలుపడ్డాయి.

ఈ మారు రాజేశ్వరి, సత్యమూర్తి కోర్టులో కనిపించారు.

రాజేశ్వరి భర్తనుండి విడాకులు తీసుకోవడానికి కోర్టు అంగీక రించింది. లంచాలు తీసుకుంటున్నాడని సత్యమూర్తిని ఉద్యోగం నుండి తీసివేశారు. డబ్బులేక ఇల్లు, కారు అన్నీ అమ్ముకున్నాడు. నాలుగయిదు నెలల్లోనే అతని పరిస్థితి మరీ అధ్వానం అయిపోయింది.

జయలక్ష్మి ఒకరోజు తను ఊరికి వెళ్ళటానికి ఒక రిక్షా యెక్కింది. ఆ రిక్షాను తొక్కుతున్నది సత్యమూర్తి. తనే పలక రించింది "ఏమోయ్ రిక్షావాలా బాగున్నావా!" అని.

సత్యమూర్తి వెనక్కితిరిగి ఆమెను చూసి తల వంచుకున్నాడు.

జయలక్ష్మికి అతనిమీద కోపం తగ్గక రిక్షా ఒక సందు దగ్గరికి వెళ్ళగానే "బాబోయ్ వీడు నన్ను బలాత్కరిస్తున్నాడు" అని గట్టిగా కేకలు పెట్టింది.

ఆ దగ్గర్లోవున్న వాళ్ళందరూ పరిగెత్తుకొచ్చి సత్యమూర్తిని కొట్టి, తన్ని చిత్రహింసలు పెట్టారు.

ఒక పోలీస్ వచ్చి అచేతనంగా పడిపోయిన సత్యమూర్తిని లాక్కుపోయి జైల్లో వేశాడు. ఆ తరువాత కేసు విచారణ జరిగి సత్యమూర్తికి ఉరిశిక్ష వేసారు.

ఆ కోర్టులో జడ్జి జయలక్ష్మి తీర్పు యిస్తూ "నిందితుడికి రెండుమార్లు ఉరిశిక్ష విధిస్తున్నాను. పోలీస్‌వాళ్లు వీడు నిజంగా రెండు మార్లు చచ్చేటట్లు చూడాలి" అంది. అందరూ పైకిలేచి జడ్జి పిచ్చిది అని గొడవచేసారు.

కల చెదిరిపోయింది.

'ఇట్లాగయితే ఈ రాత్రికి నిద్దర పట్టదు' అనుకుంటూ
ష్మి పైకిలేచి పెరట్లోకి వెళ్ళింది.

నడుస్తున్నా ఆమె మనస్సు కలలు కనడం మానలేదు.
హఠాత్తుగా ఎంతో యెత్తు పెరిగిపోయింది. వీధిలో నడుస్తుంటే
న్నీ పిచ్చుకగూళ్ళలా కనిపిస్తున్నాయి.

వికటాట్టహాసం చేసింది. జనం భయంతో పారిపోయి తలా
చోట దాక్కున్నారు.

తను అడుగుతీసి అడుగు పెడుతుంటే ఎన్నో యిళ్లు నలిగి
న్నాయి. ఎందరో మనుష్యులు ప్రాణాలు పోగొట్టుకుంటున్నారు.

తను గర్వంగా అలాగే నవ్వుకుంటూ సత్యమూర్తి యింటి
ర కొచ్చింది. ఇంటి పైకప్పును అవలీలగా పైకెత్తి విసిరి
సింది. హాల్లో సోఫామీదని వెల్లకిలా పడుకొని స్టైలుగా సిగరెట్టు
స్తున్నాడు సత్యమూర్తి.

తను ఒకచేత్తో సత్యమూర్తిని గట్టిగా పట్టుకొని పైకెత్తింది.
విలా తన్నుకొంటున్నాడు సత్యమూర్తి. తను అదేమీ పట్టించుకో
డా సముద్రం దగ్గరకు తీసుకువెళ్ళి మధ్యలో విసిరిపడేసింది.
లు, మొసళ్ళు, పాములు సత్యమూర్తిని చుట్టుముట్టాయి.
క్కటి ఒక్కొకండ పీకుతుంటే సత్యమూర్తి వెర్రికేకలు
తున్నాడు....జయలక్ష్మి తరువాత ఆలోచించలేక పోయింది.
ళ్ళ ఇంట్లోకి వచ్చింది. ఆమె మనస్సు క్షణంసేపు గూడ నిలకడగా
డటంలేదు.

గాలికి కాగితాలు రెపరెపలాడుతున్నట్లు ఆలోచనలు. ఆలోచనల
గాలి ఆమెను వూపిరి తీసుకోనియ్యటంలేదు.

రెండునెలల నుంచి ఇదే వరస. రాత్రిగాని, పగలుగాని
మని ఒకగంటసేపు నిద్ర పట్టిందిలేదు.

ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది జయలక్ష్మి.
ఈ ప్రాంతాల నుండి సాధ్యమయినంత తొందరగా బయట
లి. సాధ్యమయినంత దూరం పారిపోవాలి.

ఆ రాత్రిలో మిగిలిన భాగాన్ని అప్పటికప్పుడే బయ
స్టేషన్‌కు వెళ్ళి గడిపింది జయలక్ష్మి.

రైల్వేస్టేషన్ జనంతో కిటకిటలాడుతోంది. ఆ జన
లోనే అసహనంగా అటు యిటూ తిరగసాగింది. తను ఎక్క
కోసం వేచివుండాల్సిన పది నిమిషాల లోపలే భూకంపం వ
అన్నంత తొందరపడుతోంది మనస్సు.

ఆమె తొందరను అర్థం చేసుకున్నదేమో రైలు తొం
గానే వచ్చింది. దిగుతున్న జనాన్ని తోసుకుంటూ ఒక పెట్టె
యెక్కడానికి ప్రయత్నించింది జయలక్ష్మి. దిగుతున్న వాళ్ల ర
డుతో వెంటనే యెక్కడానికి వీలుపడిందికాదు.

జయలక్ష్మి తల ప్రక్కకు తిప్పి మిగిలిన కంపార్టుమెం
వైపు చూసింది.

తన పక్కనేవున్న ఫస్ట్‌క్లాస్ కంపార్టుమెంట్‌లోకి యెక్క
బోతున్న రాజేశ్వరి సత్యమూర్తి కనిపించారు. ఇద్దరూ నవ్వుతు
ఒకరిచెయ్యి ఒకరు పట్టుకొని పైకెక్కుతున్నారు.

జయలక్ష్మికి కళ్ళముందు అంతా చీకటి. ప్రపంచమంతా
గిర్రున తిరుగుతున్నట్లు అనిపిస్తోంది.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M108 |
| పుస్తకం పేరు | జ్యోతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 113 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |